# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండా కూడా కాపాడుకోండి!




ఎందుకంటే: ఒక్క సారి తోముకొంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని, దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియనంతటా శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది!

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమం తప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చురుకైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు. ఎందుకంటే దాం పేపు ఉండే దాని పిప్పరమెంటు వంటి రుచి అంటే వారికి ప్రీతి!

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




**నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు**

# అత్యున్నతమైన ఫ్రెంచి కాఫీ




ప్రత్యేకముగా రుచి ఎంచువారలకు సరిపడునట్లుగా బ్లెండు చేయబడి, అప్పటికప్పుడు గింజలను వేయించి పొడి చేయబడి, సువాసన వెలికి పోకుండ ఉండులాగున, బ్రూక్ బాండ్ కేఫే బ్రాండు ఫ్రెంచి కాఫీ సెలోఫేన్ సంచులలో మీకందజేయబడుతున్నది. శ్రేష్ఠమయిన చక్కటి రుచికల్గిన ఫ్రెంచి కాఫీ కావలెనంటే, బ్రూక్ బాండ్ మీదే ఆధారపడండి. మీరు కొనుటకు అత్యంత శ్రేష్ఠమయినది ఇది ఒక్కటే.

## బ్రూక్ బాండ్ కేఫే బ్రాండ్ ఫ్రెంచి కాఫీ

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఏమండీ! 22—6—62 సంచిక అట్టమీద బొమ్మ అర్థం ఏమిటో తెలువలేదు.

రవణారాజు ( ఏలూరు )

**అర్థం తెలుపవలసివస్తుందని మేము అనుకోలేదు!**

*  *  *

22—6—62 తేదీ పత్రిక ముఖచిత్రం చూడగానే దాని అర్థము తెలియకపోయినాగాని, చెప్పలేనంత నవ్వు పుట్టుకొచ్చింది.

వి రామారావు ( యర్రవరం )

*  *  *

22—6—62 పత్రిక అట్టమీద సత్యమూర్తిగారి బొమ్మచూసి నవ్వొచ్చింది. బహుశః దాని అర్థం సోఫాలో కూర్చొని భగవద్గీత చదువుతున్నట్టు నటిస్తూండగా భార్యరాక చూసి, కంగారెత్తి సోఫాలోంచి ఎగిరిపడ్డాడేమో భగవద్గీత పుస్తకంలో “ప్రేమ” అనే పుస్తకం ఆమె చూచిందేమోనని గాభరాపడిఉండొచ్చు. అది అతడి ఊహాగానం. ఆమె తనవైపు తీక్షణంగా, కోపంగా చూస్తున్నదని భావించుకొన్నాడేమో! దయచేసి ఆ కార్టూన్ అర్థము చెప్తారా? నాకు ఆవిధంగా తోచింది

వి లక్ష్మి ( శ్రీకాకుళం )

*  *  *

22—6—62 సంచికలో విషయానుక్రమణిక యందు ముఖచిత్రం శ్రీ బి వి. సత్యమూర్తి అని ఉన్నది. కాని శ్రీ సత్యమూర్తిగారు భార్యనుచూసి ఎందుకలా కంగారు పడుతున్నారో! భగవద్గీత, ప్రేమనవలల అర్థమేమిటక్కడ?

ఆర్. రాజారెడ్డి ( ముళబాగలు )

**ముఖచిత్రంలో మనిషి శ్రీ సత్యమూర్తి కాదు!**

## ప్రపంచ ప్రముఖులు

“ప్రపంచ ప్రముఖులు” శీర్షిక ఎంతో ఉపయోగకరంగాఉంది. ప్రపంచ ప్రముఖుల బొమ్మ లనుగాక, వారిని గురించి వ్రాసేది కూడా ‘ఊమెన్’ గారేనా?

బి. సత్యనారాయణ ( పామర్తి )

**కాదు!**

## గళ్ళనుడికట్టు

గళ్ళనుడికట్టు—103 కు ఇచ్చిన ఆధారాలలో 22 నిలువు ‘సైన్యము’ అని ఉంది నుడికట్టు పూర్తిచేసేటప్పుడు 22 నిలువులో ‘సేన’ అని వ్రాశాము. కాని మీరు మరుసటివారం ప్రచురించిన జవాబులో 22 నిలువు “మోన” అని ఉంది ఇది తప్పుకాదా?

పి. యస్. అప్పారావు ( గరగపర్రు )

**కాదు!**

## కార్టూన్లు

**22—6—62 సంచికలోని శంకర్‌గారి ‘ఎప్పుడూ** ఇంతో కార్టూన్ చూడగానే నవ్వలేకపోయాము అదీగాకుండా ‘వనితావాణి’లో ఆ కార్టూన్ ప్రచురించటం మరో విశేషం! ఎందుకంటే అటువంటి వనితామణులుకూడా వనితావాణిలో రాస్తూనే ఉంటారుగదా!

వెలగల గోపాలకృష్ణారెడ్డి ( రాజమండ్రి )

*  *  *

22—6—62 పత్రికలో హమేషా—తమాషా శీర్షికలోని సత్యమూర్తిగారి కార్టూను చూచాను. ఇది చాలా అసందర్భంగా ఉంది. ఎంత పిరికివాడికయినా మాట్లాడేపాటి ధైర్యం ఉండకపోదు అదీగాక, కసరత్తుచేస్తే కండబలం వస్తుందిగాని ధైర్యం రాదు. దీనినిబట్టిచూస్తే కేవలం నవ్వు తెప్పించడంకోసమే వేస్తున్నారనిపిస్తున్నది.

వి. ఉదయకుమార్ ( విశాఖపట్నం )

## కథకులకు చిట్కాలు

“కాబోయే కథకులకు చిట్కాలు” అను పుస్తకము పంపించినందులకు చాలా కృతజ్ఞుణ్ణి. అంతా చదివాను. శ్రీఅరుద్రగారు చాలా చక్కగా ‘చిట్కాలు’ చమత్కరించి రాసారు. చాలా సంతోషం. మా బోంట్లకు ప్రోత్సాహమిచ్చి పైకి తేదలచుకున్న మీకు,బొమ్మలు వేసిన బాపుగారికి,రచన చేసిన అరుద్రగారికి చాలా అభినందనలు బాపుగారు అరుద్రగారి బొమ్మ వేసినందుకు చాలా సంతోషం కాని క్రింద కూర్చున్న వారెవ్వరో?

యం. యం కృష్ణ ( షాలాకాపూర్ )

**మీరు కాదుకదా!**

*  *  *

మీరు పంపిన పుస్తకము (కాబోయే కథకులకు పనికివచ్చే చిట్కాలు) మాకు చేరినది. అశ్రద్ధ చేయక వెంటనే పంపినందులకు చాలా సంతోషము. మేముకూడా త్వరలో ఒక కథరాసి పంపగలము. వెంటనే పంపినందులకు మీకు మా ‘అభివందనములు’

తటవర్తి శరభరాజు ( కాకోలు )

## గేయం

**22—6—62** తేదీగల ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురితమయిన శ్రీ వి. వి సుబ్బారావు గారి “ ఏరుదాటని మానమనసు” అద్భుతంగా ఉంది.

డి హనుమంతరావు ( విజయపురి )

## సరాగమాల

“మంచిమనసులు” చిత్రంలోని “త్యాగం ఇదియేనా? హృదయం శిలయేనా?” అనుపాట “ఆగవోయీ, ఆగవోయీ’ అని నాలుగుసార్లు అనటంతో మొదలవుతుంది పాటల పుస్తకంలోనూ వుంది కాని రికార్డులో కనీసం రెండుసార్లయినా లేదు?

**“రికార్డు లింకేనా?**
**పాటలు కొంతేనా?**
**ఏలా ఈ లోపం?**
**ఏదో పరితాపం!**

కె. జి. జయరామిరెడ్డి ( తూ. తాండ్రపాడు )

*  *  *

ఘంటసాల, సుశీల అమోఘంగా పాడిన “ఓహోహో హో మావయ్యా, ఇదేమయ్యా .....” అన్న ‘ఆరాధన’లోని పాటలో “నీరున తిరిగే నోరును తెరిచే. .... ఇవి ఆకూ అలమూ తింటాయి” అన్న నాలుగు చరణాలు ఎందుకు రికార్డులలో లేవో తెల్పి, నా సందేహాన్ని తీరుస్తారని తలుస్తాను

భోగరాజు బలరామమూర్తి ( బొబ్బిలి )

*  *  *

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు శ్రీ వి. ఎ కె. రంగారావుగారు వ్రాసే “సరాగమాల” కాంతిమత్ రత్న మాణిక్యమాల; వివిధప్రమాన దివ్య సురభిళ గాథా పరిష్వంగ వానంతహేల; పరువంలోని కౌగిలింతవలె మరువంలోని మాదకతవలె పాఠకులనేదివ్యభువనాలకో తరలించుకుపోయే నిపుణతాఖేల. ఇంకా నా ఆనందం తీరలేదు. ఈ క్రింది పద్యంకూడా సరాగమాల స్తోత్రపాఠంలోనికే చేర్చప్రార్థన.

తే. గీ. మల్లికా పరిమళ దివ్య మందమలయ
పవన వీచికా మృదులతా భ్రాంతిరేఖ
భావనా చతురాశా ప్రభావదీప్తి
రమ్య మాధురీ జలధి “సరాగమాల”

రచయితకు, మీకు నా హృదయపూర్వక అభినందనలు

వాణి (కొత్తపేట)

*  *  *

“ఖైదీ కన్నయ్య” చిత్రంలో “గిరిజ” డాన్సు చేస్తూ, “అందాలకళ్ళు చూడు’’’’ చూశావా? పోగిపో పోగిపో!” అన్న పాటలో వినిపించిన మగ గొంతుక ఎవరిదో తెలియజేస్తే సంతోషిస్తాము.

ఏలూరి వీరరాఘవరావ్ (ద్రాక్షారం)

*  *  *

‘గుండమ్మ కథ’ చిత్రములో ఘంటసాలవారు పాడిన ‘కోలుకోలోయన్న’ అన్న పాటలో మధ్య మధ్యలో ఒక స్త్రీ కంఠం వినిపిస్తుంది. అది ఎవరిదో శ్రీ వి. ఎ. కె రంగారావుగారు తెల్పుతారని ఆశిస్తున్నాను.

ఎస్. హేమచందర్ (వరంగల్)

*  *  *

‘సరాగమాల’లో వి ఎ. కె. రంగారావు కామిక్ రికార్డుల్ని గురించి చాల అన్యాయంగా వ్రాశారు. అసలు వాటిని ఆవిధంగా కాక పురాతనపద్ధతిలో చేస్తేనే బాగుంటుందని వ్రాశారు. కాని మాలాటి డీలర్లకు అవే పాడిపంటలు. రంగారావుగారు ‘చాకిరేవు మహత్యం’ రెండవప్రక్క పిధికూతల భాగవతం జి ఇ. 37505 వినేఉంటారు నిజంగా మేము ఆ రికార్డుల్ని మా కష్టమర్సుకు సరిగా సప్లయి చేయలేకపోయాము అంటే అతిశయోక్తికాదేమో. ఇటువంటి రికార్డుల్ని తీసివేసేకంటే వాటికి అనుకూలిత సమయాల్లో వాటిని ఉపయోగించడం మంచిదని నా ఉద్దేశ్యం.

డి. రాముస్వ గ్రామఫోను డీలర్ (నర్సరావుపేట)

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం · 6—7—62
సంపుటము : 54 సంచిక : 44
శుభ॥ సం॥ ఆషాఢ మాసం॥ శుద్ధ చవితి
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకులు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1






సారధీవారి 'ఆత్మబంధువు' లో
ఎన్. టి. రామారావు.

## మనలోమాట

ఈ వారం మరొక కార్టూన్ శీర్షిక 'ఇదీ వరస' మొదలు పెడుతున్నాము! శ్రీ 'సుందర్' గారి కార్టూన్లు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో చాలా పడ్డాయి. 'ఇదీ వరస' కూడా తక్కిన కార్టూన్ శీర్షికల వలనే పాఠకుల అభిమానం చూరగొనగలదని తలుస్తున్నాము. (శ్రీ సుందర్ గారి ఊరు గుత్తి.)

* * *

15-6-62 సంచికలోని 'పాణి పెళ్ళి' కథలో 'రఘు' పేరే పొరపాటున, చివరి సంతకంగా ఉండి పోయింది! చాలామంది పాఠకులు ఈ విషయమై ఉత్తరాలు వ్రాశారు. ఈ పొరపాటు ఎలా దొర్లిందో చెప్పలేకుండా ఉన్నాము.

* * *

ఆగ్రదగారి 'చిట్కాలు' అందినట్లు చాలా మంది వ్రాస్తున్నారు. ఇంతవరకు, ఒక్కరే ఒక్కరు తప్ప-మద్రాసునుంచి-అందరూ 'చిట్కాలు' బాగానే ఉన్నాయంటున్నారు!

* * *

## లోకంపోకడ



"సంజీవయ్యగారు ముఠాతత్వం సహించమన్నారు కదూ! అందుచేత ఇకమీదట మన ముఠాకార్యక్రమాలు గుట్టుగా సాగించుకోవాలి"

## విషయానుక్రమణిక

# హరివంశము

## హారీత శివశర్మ

### సాందీపని పర్వం-64

మాతలి మరల ఇట్లు చెప్పెను :

"తరువాత ! ఏమియున్నది మహారాజా ! దారుకుని రథము నన్ను కికురించినది. నేను ఆ రథమును నిలువరించలేక పోయినాను. ఆయన రథము అదటున దూకి కదలిపోగా, నా గుఱ్ఱములును కదలినవి. రథమును కదలినది. అది ఏమి కదులుట ! ఇనుము అయస్కాంతమును బట్టి కదలినట్లు కదలినది. సూర్యుని కిరణగమనముతో ప్రొద్దుతిరుగుడు పూవు కదలినట్లు కదలినది. నేను ఆ అద్భుతమును చూచి కన్నులు మూసికొంటిని. మూసికొంటినా ! ఆ జ్ఞానము నాకు లేదు. నేను చూచునంతలో ఆయన రథము అంత దూరము పోగా నేను కన్నులు మూసికొంటి ననుకున్నాను తరువాత నా రథమే ఆయన రథము వెనుకబడినది. నా గుఱ్ఱములును విచిత్రపోష లుగా ఆయనరథ మెట్లు కదలిన అట్లు కదలినవి ఆయన రథము వేగముగా పోవుచో, నా రథము వేగముగా పోవును. వేగము తగ్గుచో వేగము తగ్గును. రేచిత, వ్లుత, దౌరతికాది గమనములుగా ఆయనగుఱ్ఱములు పోయినచో నా గుఱ్ఱములు అట్లు పోవును బహువల్గ గమన విచిత్రముగా నా యాత్ర సాగినది. నాకు ఆయన ఎందుకు ఇట్లు చేయుచున్నా డనిన ఆలోచన రాలేదు. అసలు నాకు అప్పు డే యాలోచనయు లేదు నేను సారథిగాని, ఈ రథమును తోలుటలేదు. రథమే నన్ను తోలుచున్నదివలె ఉన్నది. ఇట్లెంతసేపు జరిగినది ? నేను గమనించలేదు అంతలో దారుకస్వామి రథమును, నా రథమును సమీపములైనవి అప్పుడు ఆయనను నేను తిరిగిచూచినాను ఆయన మందహాసము చేయుచున్నాడు. నావంక విచిత్రముగా చూచుచున్నాడు. నేను ఆయనను చూచితిని. నమస్కరించితిని.

ఆయన "మాతలి !" అనినాడు.

నేను "ఏమి ! ప్రభు" అనినాను.

ఆయన నావంక విచిత్రముగ చూచినాడు.

"మాతలి ! నీవును, నేనును మిత్రులము. నన్ను అట్లు అనవచ్చునా ! నేను ప్రభువ నేమిటి ? నీకు మతిపోవుచున్నది వలె ఉన్నది."

నేను మాటలాడలేదు.

"మాతలి ! నాయందు గౌరవముచేత నీవు ఇట్లనుచున్నావు. నేను ఏమి చేయుదును. మరియు ప్రభువనగా ఒక్కడే ప్రభువు ఆయన మా కృష్ణస్వామి !" అన్నాడు.

నేను "ఔను" అన్నాను.

పౌండ్రకుడు గల్లున నవ్వినాడు. వికటముగ నవ్వినాడు రథచక్రము కిర్రుగా గతుకునేలమీద నడిచినట్లు లున్నది, అతని అప్పటి ఆ నవ్వు.

"ఏమి అన్నావురా ! మాతలి !"

"దారుకస్వామి శ్రీకృష్ణుడు ప్రభువు అనగా నేను అవును అన్నాను. మహారాజా !"

"అనగా !"

"అనగా ! ...."

"అవును ! నేను ప్రభువునుకాదు. ఆ యాదవుడు, ఆ ఆభీరుడు ప్రభువు ఓరి ! మాతలి ! మా యుప్పు తినుచున్నావు. మాకు సారథివిగ నున్నావు. మమ్ము సేవించుచున్నావు. మరి మమ్ము లను ప్రభువులనుగా భావించుటలేదు . ...."

"అదికాదు, మహారాజ !"

"ఏది కాదు"

"శ్రీకృష్ణుడు ప్రభువు అనగా, రథసారథ్య విద్యకు ప్రభువు అని. శరీరమునకు ఆత్మవలె !"

"బాగున్నది. బాగున్నది"

"అవును ! మహారాజా ! ఆ తదుపరి జరిగిన వృత్తాంతము మరియు బాగుగనున్నది."

వాని నిర్భీకతకు పౌండ్రకుడే ఆశ్చర్యపోయె ననగా, తక్కినవారివిషయము మరి చెప్ప నక్కర లేదు. మాతలి పౌండ్రకుని ప్రశ్నము లేకనే మరియు నిట్లు చెప్పెను

"మహారాజ ! మా రథములు కదలుచున్నవి గదా ! వాని నేల ఆపలేక పోయితివి ? అని మీ రందురు. అదియు చెప్పెదను. మేము అట్లు పోవుచుండగా, మన తక్కిన రథములు వచ్చి మమ్ములను చేరినవి. ఆ రథములు దారుకుని రథము చుట్టును కమ్ముకొనుట ఆయన చూడ లేదో ! ఆయన ఆ రథసారథుల నందరిని ఎరుగును. నన్ను ఎరిగినట్లే ఎరుగును. ఆయన వారి నందరిని పలుకరించెను. అందరితో పొత్తము చేసెను. అందరితో రథకారవృత్తిని గురించి, రథసారథ్య విద్యను గురించి చర్చించెను ఆయనను వారేమి యందురు ! నేనేమియంటిని గనుక ! విచిత్ర మేమనగా, వారు ఆయన చిక్కి నమకొన్నారు. ఆయనరథమును పట్టవేసితి మనుకొన్నారు. నామాక్షి సుదాములను తమముందు నిల్పితిమే— అనుకున్నారు మహారాజా !" అని మాతలి తన తోడి సారథుల దిక్కై చూచెను. వారు అవనతశిరస్కులై పోయిరి.

"ఏమిరా ! ఇందులో అవమాన మేమున్నది. మహారాజా నియమించిన పని అది. దానిని సాధించుట కట్లు చేసినాము. అది మన చేతకానిదని తరువాత తెలిసికొన్నాము. తప్పేమి ! అవమానమేమి ! మరి నేనేమి యనుకొనవలెను" అనినాడు మాతలి.

"నీవేమియు అనుకొనవలసినది లేదు. స్వామి కార్యమును చెడగొట్టితిననిమాత్రము అనుకొనవలెను" అనినాడు పౌండ్రకుడు.

"మహారాజ ! ఆ విషయము తొలుతనే విన్నవించుకొన్నాను. మరి నేను అందులకై చింత పడుటలేదు. నా చింత ఒక్కటే ఈ నా మిత్రులు దారుకస్వామివిద్యను గ్రహించ లేక పోయి నా రు. ఆవిద్య ఔన్నత్యమును ముందు అర్థము చేసికొన లేక పోయినారు. అందువలన స్వామికార్యము చెడినందులకేగాక, దారుకస్వామిని గ్రహించలేకపోయితిమే అనిగూడా వారు విచారించుచున్నారు. స్వామి ! దారుకస్వామివిద్య ఎట్టిదనగా, ప్రథమ ఉషస్సు వంటిది దాని అందము దానిది. అది పరచోటుల కన్పించునా ! సర్వ జంతుజాలము దానినిచూచి అప్రతిభమై పోవును. సమ్మోహమునుచెంది పోవును మరి ఆవిద్య యెట్టిదనగా, శ్రీకృష్ణుని వేణుగానమువంటిది" ....

-62 వ పేజీ చూడండి




"ఏడుకొండలవాడా! వెంకటరమణా గోవిందా! గోవిందా" అనుకుంటూ తిన్నగా తిరుపతిచేరి ఏకాఏకిని ఆ ఊళ్లోనే ఉంటున్న మా సోందేవమ్మత్తగారింటి కెళ్లాను

బొత్తిగా తలమాసినవాడిలా ఉన్న నన్ను చూసి 'పరీక్ష క్షవరంకాకుండా కాపాడినందుకు స్వామిసమక్షంలో మున్నగా (అంటే దూరపు కొండలా) క్షవరం చేయించుకోడానికి వచ్చి ఉంటాడు.' అనుకున్నారు మా సోందేవమ్మత్త అండ్ ఫామిలీ

కక్కు వచ్చినా, కల్యాణం వచ్చినా ఆగదన్నారు పెద్దలు క్షవరకల్యాణం విషయం కూడా అంతే నేమో!! 'కళ్యాణకట్ట' నేము వెళ్లేసరికి చాలా హడావుడిగా ఉంది. భక్తులంతా వరుసగా కూర్చుని 'గుండ్లు' చేయించుకుంటూంటే చూడ ముచ్చట వేసింది నామట్టుకు నాకు గడ్డం మీసాలతో బూచాళ్లల్లా వచ్చినవాళ్లందరూ 'సానపట్టిన వజ్రాల్లాటి' గుళ్లతో మెరుస్తూ వెళ్లిపోతున్నారు.

"ఆహా!" అని ఆనందతన్మయుణ్ణి అవుదామనుకునే లోపులో "ఏంది స్వామీ! అలా దిక్కులు చూస్తావుండావ్?" అని నన్ను లాక్కెళ్లి బలవంతాన కూర్చోపెట్టి గుండు గీసెయ్యడం మొదలుపెట్టాడు బీజపూర్ సుల్తాను ఉన్న ఒకానొక "మంగలిమంత్రి"

నాకు చెడ్డ సిగ్గేసింది గుండు గీయించుకుంటుంటే తాళికట్టించుకునే పెళ్లికూతురిలా సిగ్గుతో తలొంచేసుకున్నాను (అసలు ఆమాట కొస్తే ఈ రోజుల్లో పెళ్లికూతుళ్లు కూడా వాలా వంచుకోరు అయినా మహామహావాళ్లే మంగలి ముందు తలవంచాలిగా అని సరిపెట్టుకున్నా)

గుండు గీయడానికి ఆట్టేసేపు పట్టకపోయినా ఆ కాస్సేపే విశ్శబ్దంగా కూర్చోలేక,

"నువ్వు రోజుకి ఎన్ని గుళ్లు గీస్తావూ!!?" తల వంచుకునే అడిగాను.

"ఎంత లేదన్నా మామూలురోజుల్లో రెండు, మూడు డజన్లు గీస్తాను"

"ఏమిటి!? దీనికి మామూలురోజులూ — ప్రత్యేకరోజులూ ఉంటాయేమిటి?"

"ఉంటాయండి. పరీక్ష రిజల్ట్సు వచ్చేరోజులు చూడాలి .... ఖుకవేస్తే రాలరు జనం. తండోప తండాలు కదండీ ...."

ఇంకా ఏదో అడుగుతుంటే 'పూర్తయ్యింది' అన్నాడు.

చెయ్యి అనుకోకుండా నెత్తిమీదకు వెళ్లింది ... 'సొగసైన క్రాపు పోయిందని' తెలుసుకోడానికి క్షణంలో సగంసమయం పట్టలేదు

"నీటిబొట్టు ఆగదంటే నమ్మండి" అన్నాడు మంగలి

అదెంత నిజమో నని ఓ రెండు నీటిబొట్లు 'గుండు మీద వేయించాను అవి జారటంమాటెలా ఉన్నా పుండుమీద కారం జల్లినంత మంట పుట్టింది 'బాధ భరించలేక 'అమ్మో' అన్నాను.

'నేను నయమండి మిగతావాళ్ళయితే చిత్రి పట్టేద్దురూ . నల భై ఏళ్ల సర్వీసు" అన్నాడు.

రోజుకు రెండు డజన్ల చొప్పున నలభై ఏళ్లకు ఎన్ని గుళ్లు! గీశాడో!?

నిజమేనేమో! మరి అనుకుంటూ మరోసారి నా గుండును తనివితీరా చేత్తో రాసుకుంటూంటే వెనుకనుంచి ఎవరో "సాక్షాత్తూ కుమారస్వామిలా ఉన్నాడు" అనుకుంటున్నారు. (కుమారస్వామికి గుండు అవునా, కాదా అని ఆలోచించకండి ... మరి)

'మున్నటి గుండు' చూస్తే ఎవడికైనా సరి ఒక్కసారి చెయ్యివెయ్యాలనిపిస్తుంది. (వెనుకటికి ఒకరు ( గుండాయన ) ఎవరో మరొకర్ని అడిగారుట. "నీ తీరని కోరిక ఏమిటి !?' అని అంటే రెండో ఆసామీ జవాబిచ్చాడుట. 'మీలాటివాళ్ళ మున్నటి గుండుమీద 'ఐస్'మీద జారినట్టుగా జారాలనిపిస్తుంది' అని). సరసులు సంగీత పాఠకులైతే 'రామకీర్తన' పాడిస్తే!? అన్పిస్తుంది గుండు చూడగానే

ఇంటికి రాగానే (కొండదిగి) సోందేవమ్మత్త నా గుండు . 'చలిమిడి' ముద్దలా ఉంది' అంది అంతవరకూ 'నా గుండు తడిమిచూసుకున్నానే కాని— ఆ గుండు సౌందర్యాన్ని సరిగా తిలకించేభాగ్యం నాకు అప్పటివరకూ కలుగలేదేమో ఎదురుగా కనుపించిన నిలువుటద్దంముందర నిలుచున్నాను

గుండుకి కొంచెం మూనెతడి తగిలింది కాబోలు ... చుట్టుపక్కల్నించి సూర్యకాంతి కిరణాలు 'గుండు'మీద పడి ప్రతిఫలిస్తుంటే ప్రకృతిసౌందర్యం • • లా నా గుండుమీదే ఉందేమో ! అనిపించింది. (దగ్గరగా ఎవ్వరైనా వచ్చి నా గుండువైపు చూస్తే తప్పకుండా వారి ప్రతిబింబం కన్పిస్తుంది – అనుకున్నాను )

బాబిగాడు "బోడిగుండు బొబ్బాసి గుండు" అని లోలోపలే అనుకున్నాడు బొబ్బాసి గుండేమిటి!? గాడిద గుడ్డు

అంత అందమైన గుండుని ఎండవానలకు వదిలేస్తే దాని సొగసు తగ్గిపోతుంది కదూ !! అందుకని దానికి తగిన 'గుండురక్ష' ఏదైనా కొనడానికి బజారుకి బయలుదేరాను.

స్వరాజ్యం సంపాదించిన రాజ్యంలా తలయొక్క ఉపరితలం స్వేచ్ఛావాయువులు పీలుస్తోంది. రోడ్డుమీద నడుస్తూంటే మనస్సు పరిపరివిధాల పోయింది రకరకాలైన ఆలోచనలు ప్రారంభమయ్యాయి

"అందుతే జుట్టు లేకపోతే కాళ్ళా పట్టుకునే వాళ్ళకూడా మనల్ని ఏమీ చెయ్యలేరు. ఎందుకంటె మనకి గుండు కాబట్టి. మన పిలక వాడి చేతులో ఉంటే' అనే భయం అసలే లేదు. అసలు 'పిలక' అనేది భూగోళపరిశీలకుల దృష్టిలో ఏ చెట్టూ లేని ఎడారిలో ఆముదం చెట్టులాంటిది ... మొన్నమొన్నటిదాకా ఉపనయనం చేయించుకున్నవాళ్ళకి ఈ పిలకబాధ తప్పేదికాదు అయినా ఒక పిలక అయితే ఫరవా లేదు ఒకడిచేతిలోనే ఉంటుంది. పంచ శిఖలూ అయిదుగురి చేతుల్లో పడితే 'ద్రౌపది' లాగ బాధ పడవలసి వస్తుంది.

మరీ పూర్వకాలంలో 'పతి' ని కోల్పోయిన 'సతి' ఈ బాధ భరించలేకనే కాబోలు 'సహగమనం' చేసేదట

రానురాను "ప్రజలు గుండువిలువ గుర్తించారు ఐకమత్యంతో పోనుపోను ఇంకా గుర్తిస్తారు. దేశం అభివృద్ధిలోకి వస్తుందని అభిజ్ఞవర్గాలవారు అనుకుంటున్నారు" అని ఆయు

—58వ పేజీ చూడండి

## కొత్తశీర్షిక: ఇదీవరస—1

సుందర్



## ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
## మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి




నిజం, ఈ కొత్త సబ్బు చాలా బాగుగా శుభ్రపరుస్తుంది అనేదా నేను కనిపెట్టేను.

అది ఏ ఇతర సబ్బులకంటె చాలా కాలము నిలవుంటుంది, అంతకంటె ఇంకేమి కావాలి.



# మనమూ - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## జఠర రసము : జఠరాశయ రోగములు

జీవకణములు విభజించబడినప్పుడు మార్పుచెంది, రకరకముల టిష్యూలుగా ఏర్పడుతవి. అల్లా ఏర్పడిన టిష్యూలలో అతి ప్రధానమైనవి (1) ఎపితిలియల్ ధాతువు (Epithelial Tissue) (2) నరధాతువు (Nervous Tissue) (3) కండర ధాతువు (Muscular Tissue) (4) సంబంధ ధాతువు (Connective Tissue) (5) సంతాన ధాతువు (Reproductive) ఈ అయిదు స్థానికములు. అంటే వీటిలో జీవకణములు ఒకేచోట గుమిగూడి ఉంటవి ఇవిగాక అనుక్షణము సంచరిస్తూ ఉండే ద్రవధాతువులు (Fluid Tissues) రెండున్నవి అవి (1) రక్తము, (2) లింపు (Lymph). శరీరంలో ఏ అంగములోనైనా ఎపితీలియనర, కండర సంబంధ, రక్త, లింపు ధాతువులు విధిగా ఉంటవి. సంతాన కోశములో ఇవిగాక శుక్ల రజఃకణములను తయారుచేసే గ్రంధులు కూడా ఉంటవి.

కొంతకాలం క్రిందట జీర్ణకోశమును వర్ణిస్తూ, జఠరాశయమును వర్ణించాను అది ఒక J ఆకారము గల అంగము ఒకస్థితిలో అది పాలసీసా ఆకృతిని కూడా ధరిస్తుంది ఈసొఫెగస్, దయాఫ్రమును చొచ్చుకుని జఠరాశయములో అంతమవుతుంది. ఈసొఫెగస్, జఠరాశయము కలిసేచోట, ఒక ఉంగరంవంటి కండరనిర్మితి ఉన్నది. ఇటువంటి కండర నిర్మితిని 'స్ఫింక్టరు' (Sphincter) అంటారు 'కార్డియము' (Cardium) అంటే హృదయము ఈ స్ఫింక్టరు హృదయానికి సమీపంగా ఉన్నందున దీనిని కార్డియల్ స్ఫింక్టరు (Cardiac Sphincter) అంటారు జఠరాశయము క్రిందికొన చిన్నప్రేగుతో కలిసిపోతుంది. ఈ ప్రదేశంలోనూ ఒక స్ఫింక్టరు ఉన్నది. దీనిని పైలోరిక్ స్ఫింక్టరు (Pyloric Sphincter) అంటారు ప్రేగు మొదటిభాగమును డుయోడినం అంటారు

జఠరాశయమును ఇంగ్లీషులో స్టొమక్ (Stomach) అంటారు. పాశ్చాత్య పరిభాషలో గేస్ట్రియం (Gastrium) అంటారు ఇందులో జఠరరసము ఉత్పత్తి అవుతుంది అందువల్ల సంస్కృతంలో దీనిని జఠరాశయము అంటారు. జఠరరసంలో హైడ్రోక్లోరిక్ ఏసిడ్ (Hcl) ఉంటుంది. అందువల్ల దానికి ఆమ్లాశయము అని కూడా పేరున్నది. ఇక్కడ జఠరాగ్ని అని ఒక అగ్ని ఉన్నదనీ అందువల్ల అందులోకి పోయిన ఆహారము వండబడుతుందనీ ఆయుర్వేద శాస్త్రజ్ఞుల విశ్వాసము. గుజరాతీభాషలో జీర్ణశక్తిని పచనశక్తి అంటారు. ఇందువల్ల జఠరాశయమునకు పక్వాశయము అని కూడా పేరు.

జఠరాశయము గోడలో మూడు పొరలున్నవి. అవి పైనుంచి లోపలికి క్రమంగా (1) సీరస్ పొర, (2) కండరములపొర, (3) మ్యూకస్ పొర. ఈ పొరలోనే జఠరరసమును స్యందించే గ్రంధులున్నవి మ్యూకస్‌పొర ముడతలు ముడతలుగా ఉండి జఠరాశయం లోపలిప్రక్కను కమ్మి ఉంటుంది. కండరముల పొరవలన జఠరాశయమునకు బలవత్తరమైన సంకోచ వ్యాకోచకశక్తి ఉన్నది.

ఆరోగ్య స్థితిలో జఠరాశయం నిరంతరాయంగా ఒకేవిధంగా జఠరరసమును ఉత్పత్తిచేస్తూనే ఉంటుంది అయితే పరిస్థితులనుబట్టి ఉత్పత్తి అయిన జఠరరసము పరిమాణము మారుతూ ఉంటుంది జఠరాశయము పనిచేయనప్పుడు, అంటే అందులో ఆహారం లేనప్పుడు షుమారు 15 ఘన సెంటిమీటర్ల పరిమాణంగల జఠరరసము ప్రతి గంటకు ఉత్పత్తి అవుతూ ఉంటుంది.

జఠరాశయంలో రెండు భాగములున్నవి. అవి (1) ఫండస్ (Fundus) అనే ఊర్ధ్వభాగము (2) పైలోరస్ అనే క్రిందిభాగము పైలోరస్ అంటే ద్వారరక్షకుడు అని అర్థము ఇందులో ఫండస్‌లో ఉండే మ్యూకస్ మెంబ్రేనులో జీవకణములు హైడ్రోక్లోరిక్ ఏసిడ్‌ను స్యందిస్తుంది మ్యూకస్ మెంబ్రేనులో ఉండే మ్యూకస్ జీవకణములు, మ్యూకస్‌ను బంకవంటి పదార్థమును స్యందిస్తవి ఈ బంకకు 'ఆమము' అని పేరు. ఈ కారణంవల్ల జఠరాశయానికి ఆమాశయము అని పేరు పైలోరస్‌లో ఉండే గ్రంధులు, పెప్సిన్ అనే ఎంజయిము అన్న రసమును స్యందిస్తవి జఠరరసంలో, పెప్సిను, రెనిన్ అనే ఎంజయిములు, హైడ్రోక్లోరిక్ ఏసిడు, నీరు, క్లోరైడ్ (Chloride) జాతికి చెందిన కొన్ని లవణములు కొద్ది పరిమాణములలో ఎమైనులు (Amines), ఎమ్మోనియా (Ammonia $Nh_3$) ఉంటవి

జఠరరస గ్రంధులు ఉద్రిక్తములు కావడానికి కారణములు చక్షురింద్రియము, ఘ్రాణేంద్రియము. మనం మంచి ఘుమఘుమలాడే ఆహారవాసనను అనుభవించినా, మంచి తినుబండారములను చూచినా నోరూరుతుంది అల్లాగే జఠరకోశంలో జఠరరసమూ ఊరుతుంది. అయితే ఒక్కొక్క ప్రేరేపక కారణం (Stimulus) వల్ల ఒక్కొక్క జఠరరసభాగము ఉత్పత్తి కావచ్చు ఇందువల్ల ఒక్కొక్క కాలంలో జఠరరసంలో వస్తువుల పరిమాణములు ఒక్కొక్కలా ఉండవచ్చు. కాని సాధారణంగా హైడ్రోక్లోరిక్ ఏసిడ్ పరిమాణము మాత్రము మారదు. నోటితో తయారయ్యే లాలాజలమునుబట్టీ, తీసుకున్న ఆహారవస్తువుల రసాయనికస్వరూపమును బట్టీ, డుయోడినంలోనుంచి జఠరాశయములోకి ఎగదన్నే క్షారగుణంగల ఆంత్రరసమునుబట్టీ జఠరరసం రసాయనికస్వభావం మారుతూ ఉంటుంది. ఇంతేకాదు. జఠరాశయంలోనే వివిధ భాగములలో జఠరరసంలో ఉండే ఏసిడ్ భాగము మారుతూ ఉంటుంది.

ఒక్కొక్క వ్యక్తిలో జఠరరసం రసాయనిక స్వరూపం, ఒక్కొకలా ఉండవచ్చును. ఈ వ్యక్తిగతమైన మార్పులు, వంశపారంపర్యంగా వస్తూ ఉండవచ్చును అంటే కొన్ని కుటుంబములలో పుట్టినవారిలో జఠరరసంలో ద్రావకాది భాగములు హెచ్చుతగ్గుగా ఉండే లక్షణము పరంపరగా సంక్రమించినా ఉండవచ్చును

ఈ జఠరరస స్యందనానికీ, మానసికస్థితికీ చాలా సన్నిహితసంబంధము ఉన్నది. పెద్ద ఆశలూ ఆశయాలూ ఉన్నవారిలోనూ, నిత్యమూ చిరాకూ చికాకూ అనుభవిస్తూ, అశాంతితో బాధపడేవారిలోనూ, జఠరరస స్యందనం ముఖ్యంగా హైడ్రోక్లోరిక్ ఏసిడ్ స్యందనం అధికంగా ఉంటుంది ఉద్రేకాలకు లోనుగానివారిలోనూ, ఏ పరిస్థితికీ చలించనివారిలోనూ ద్రావకస్యందనం సాధారణంగానో కాస్త తక్కువగానో ఉంటుంది. హైడ్రోక్లోరిక్ ఏసిడ్ అధికంగా ఉత్పత్తి అయ్యేవారి జఠరాశయంలో, నిరుద్రిక్తస్థితిలోనే చాలా ఎక్కువగా జఠరరసం తయారై ఉంటుంది. అందులో ఏసిడ్ (Acid) ఎక్కువగానూ, మ్యూకస్ చాలా తక్కువగానూ ఉంటుంది ద్రావక ప్రభావం నుంచి జఠరాశయం మ్యూకస్‌మెంబ్రేనును ఈ మ్యూకస్ కాపాడుతుంది మ్యూకస్ తక్కువ కాంగానే, జఠరాశయం మ్యూకస్ మెంబ్రేను అధికంగా ఇరిటేట్ అవుతుంది. అప్పుడు చాలా త్వరగా పైలోరిక్ స్ఫింక్టరు తెరుచుకుని జఠరాశయంలో ఉన్న హైడ్రోక్లోరిక్ ద్రావకములో నిండివున్న అర్ధజీర్ణాహారము డుయోడినంలోకి ప్రవేశిస్తుంది డుయోడినంలో రసములన్నీ రసాయనికంగా క్షారగుణము (Alkaline) కలవి. ఇంత ద్రావకం తరుచుగా అందులో పడుతున్నప్పుడు డుయోడినం మ్యూకస్‌మెంబ్రేను చిట్లి, అక్కడ 'అల్సరు' ఏర్పడడానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడితవి. ఏసిడ్ అధిక స్థితిని హైపర్‌క్లోర్ హైడ్రియా (Hyperchlor-hydria) అంటారు 'హైపర్' అంటే అధికమైన క్లోర్ హైడ్రియా అంటే 'హైడ్రో

55-వ పేజీ చూడండి



దేవీఫిలింస్ 'మురిపించే మువ్వలు'లో జెమినీ గణేశ్

చిత్రసమీక్ష

# అర్థకళాత్మకం, అర్థభయాత్మకం "మురిపించే మువ్వలు"

శిశుర్వేత్తి పశుర్వేత్తి
వేత్తి గానరసం ఫణి — అన్నారు పెద్దలు దీన్నే "రాగభావమున పశువులు, శిశువులు, పాములు పరవశమందాలి" వీలుగా తెనిగించుకున్నారు సినీ కవులు దాని మహత్తు అలాంటిది. ఆ స్వరచ్ఛాయల్లోనే నవ భావాలు, నవరసాలు ఉత్పన్న మౌతాయి. అందుకే భావతాళాలకు మధ్య సంధిగా నిలిచి భరతం అనే శబ్దానికి సార్థకతను చేకూర్చింది రాగం ( లేక నాదం ) ఈ త్రిగుణాత్మక ప్రకృతిని నిరూపించి ఆనందం కల్గించేవి నాటకాలు తదితర రూపకాలు కనుకనే ఆ రోజుల్లో రాజస్థానాలు కళావికాసాలకు ఆటపట్టులై వుంటుండేవి. మరి ఇది సినిమా యుగం, కళక్కర్లేదని మానేసిన జగం. అందుకే ఆ నాటి కళలన్నీ స్థిరంగా ఉండాలని ప్రేముల్లో ఇరుకున్నాయి ఓనాటి అలాంటి కళా వైభవాన్ని కొంతవరకు చూపించేదే దేవిఫిలింస్ చిత్రం "మురిపించే మువ్వలు"

రసిక జనపోషకుడు అని పేరుపొందిన ప్రతాప మహారాజుల ఆస్థానంలో భరతనాట్యంలో గెలుపొంది ఆస్థాన వర్తకి పదవి వలంకరించిన మల్లిక (కమల) కారణంగా సేనాని నాగదేవునకు (మనోహర్) ప్రతాప్‌కు అపరాజిత అనే నాట్యకత్తెయందు జన్మించి అజ్ఞాతంగా పూజారి పరమేశం వద్ద పెరిగినాద స్వర విద్వాంసుడైన అమరేంద్రున (జెమినీ గణేశన్)కు స్పర్థ ఏర్పడుతుంది. అమరేంద్రుని మనసార ప్రేమించిన అనాథ బాలిక, గానకోకిల శాంత (సావిత్రీ గణేశన్) మల్లికా అమరేంద్రుల ప్రేమను తెలిసికొని తన ప్రేమను త్యాగం చేయసిద్ధపడుతుంది

తన అన్యాయాలను అరికట్టాలనుకున్న తన అన్న ప్రతాప్‌ను బంధించి నాగదేవుడు (మనోహర్) రాజ్యాధిపతిగా ప్రకటించుకుని మల్లికను చెరబట్టేందుకు ప్రయత్నించటం దానికి అమరేంద్రుడు అడ్డపడటం, ప్రజలు తిరగబడి మహారాజును విడిపించటం, లక్కఇంట్లో నాగదేవ, అమరేంద్రులమధ్య జరిగిన పోరాటంలో నాగదేవుడు మరణించటం జరుగుతుంది. అమరేంద్రుడు రాజకుమారుడని వెల్లడౌతుంది మల్లికా, అమరేంద్రులకు వివాహంకాగా శాంత కుమారస్వామి సన్నిధిలో పునీత జీవనం గడుపుతుంది

భారతీయ కళావైభవాన్ని ప్రదర్శించటమే చిత్రం ఉద్దేశ్యం గనుక, కథ తక్కువ కల్పన లెక్కువగాగల ఈ చిత్రంలో శిల్పానికి, సంగీత, నాట్యాలకూ ఎక్కువ ప్రాధాన్యం కన్పిస్తుంది. కమల కుచలకుమారిల నాట్యపు పోటీ కన్నుల పండువుగా శాస్త్రోక్తంగా వుంది అలాగే తదితర నృత్యాలూ రమణీయంగా వున్నాయి ఈ చిత్రంలో ప్రత్యేకాకర్షణ, కను మోడ్పు కైమోడ్పు కలిగించేటట్లా కారైకురిచ్చి అరుణాచలం వాయించిన నాదస్వరం, అతిలోకపు భూతులు కలిగించే జానకీ కలగానం

వర్ణచ్ఛాయాగ్రహణం విదేశీ చిత్రాలంత నిర్దుష్టంగా, కన్నుల కింపుగావుంది

ఇది తర్జుమా చిత్రం గనుక నటీ నటుల నటనల బాగోగుల ప్రసక్తిలేదు. తెర బొమ్మల ముఖ భావాల కనుగుణంగా తమస్వర భావాలను జోడించాలని తెరవెనుక తారలు ప్రయత్నించి కృతకృత్యులయ్యారు

కొన్నాళ్ళు చప్పిడికూడుతింటేగాని ఉప్పు కారం విలువ తెలియదేమో అలాగే ఆరుద్ర ఈ చిత్రానికి సమకూర్చిన తర్జుమా సాహిత్యాన్నిచూస్తే ఈయన ఎప్పుడూ ఇలాగే రాయడేమా అనిపిస్తుంది కూడా. ముఖ్యంగా నీలిలపాడిద దేవాలాంటి పాటలు వింటున్నప్పుడు ఇది తర్జుమా అన్న భావం కలగదు. (మాలో మాట. అన్నిచోట్ల లచ్చ తెనుగు బహుహ్రీ సమాసాలు అంతగా బాగుండవేమో.)

కమ్మని సంగీత సాహిత్యాలు, రంగు హంగులుగల రమణీయ నృత్యాలు వగైరా కళా విలాసాలు సగం, స్టంటులూ, కత్తియుద్ధాలు వగైరా భయానక (థ్రిల్) దృశ్యాలుసగంగల ఈచిత్రం అర్ధ కళాత్మకం, అర్ధ భయాత్మకమూను ★

—నాగరాజ్

చిత్రసమీక్ష

## ఆరతి

భారతీయ సాంప్రదాయానికి, సచ్ఛీలానికి భారతీయ స్త్రీ ప్రతిబింబమని అంటూంటారు. సద్గుణాలన్నీ పుణికి పుచ్చుకున్న కథానాయికలతో అల్లిబిల్లిగా కథలల్లి, శాక్షాఫీసూత్రాలు మేళవించి, ప్రేక్షకుల అభిరుచికి తగ్గట్టుగా చిత్రాలు విడుదలవుతున్నాయి. నిరంతరం కష్టాలను సహిస్తూ, ('తదనంతరం సుఖాంతం!') అనవరతం అన్యుల క్షేమాన్నే అభిలషిస్తూ, అనుమానాలకు, ఆగ్రహాలకు ఆహుతి అవబోతూ, శోకగీతాలు ఫోటోజెనిక్‌గా ఆలాపిస్తూ, 2½ గంటల కాలక్షేపాన్ని నిక్షేపంగా అందించే తెరవేలుపులతో కథా చిత్రాలు ఈనాడు చాలా వస్తున్నాయి.

కథ సుపరిచితమయినదయినా, క్రొత్త పంథాలో హేమాహేమీలయిన నటీ నటులతో సుమధుర

—49వ పేజీ చూ డండి

జూన్ 29 తేది నుండి
విశాలాంధ్రలో
ప్రదర్శింప
బడుతున్నది



యం.యం. పిక్చర్స్ వారి

# అప్పగింతలు

దర్శకుడు మధుసూదనరావు నిర్మాత P. శ్రీరామమూర్తి

ఈస్టిండియా రిలీజ్

MOULIS




(గత సంచిక తరువాయి)

"క్రొత్తలో పొగావేశాం బ్రదర్ నీకేం భయం లేదు—అంతా నేనే చేసేట్టూ, పేరు నీపేరు వేసేట్టూ మాట్టాడి వచ్చాను. వాడికి—ఏం లేదులే, హీరోయిన్ వేసే అమ్మాయితో మాట్లాడనిస్తే చాలుట"

నాకు కోపం వచ్చింది.

"నాపేరూ నీచేతా ఎందుకూ ? ఖోడిమేళం" అన్నాను.

"ఏదో ఒకటయ్యా—వాడికి నామీద గురి. నాకు నీమీద గురి. ఏం ఫరవాలేదు. వాడు తీస్తాడు. వట్టి అడపిచ్చివాడు. హీరోయిన్ కార్లో కూచోనివ్వాలట—అన్నీ యిటువంటి కోర్కెలే కోరాడు. అన్నిటికీ యస్ అన్నాను."

"హాఁ" అన్నాను నేను. "ఏమంటే, వాడికా హీరోయిన్‌ధ్యాస తప్ప పిక్చరుధ్యాస ఉండదు. ఎంతసేపూ వాడిగొడవే వాడిది. కొన్నాళ్ళ కా హీరోయిన్ కాస్తా వాడివరమవుతే, మనం చిప్ప పుచ్చుకోవాలి."

"నీకేం భయంలేదు మహాశయా! చూడు, వాడి గోలా, ఆనందమూ సాగనివ్వటానికి మనం మాత్రం పథకాలు వెయ్యమూ. ఉదాహరణగా నీకో కథ చెబుతాను విను. హాలీవుడ్‌లో జరిగింది నువ్వు జన్మించివుండ వనుకుంటాను. ఐనా అంత మరీ పాత కథ కాదు. హెన్రీఫోర్డ్ అని ఒకతను. పెద్ద క్రోరియర్. వాళ్ళభాషలో మిలియనీరు. అతని కో సినిమాతారమీద మోజు కలిగింది. ఒకరోజు సాయంత్రం ఆమె యింటికి వెళ్ళి—'తారా తారా, నన్ను పెళ్ళాడూ' అన్నాడు. తార చిరాగ్గా లేచింది. 'ఎవరు నువ్వూ' అని లిప్‌స్టిక్ తడువుకుంది. 'నేనే తారా. నీకోసం నా సర్వస్వం ఇచ్చేస్తాను. నువ్వు నా దానివి కావాలి' అన్నాడు. తన ఆస్తిపాస్తులూ అన్నీ వివరించాడు. తార అందికదా, 'కోటేశ్వరా, నా ప్రాణేశ్వరా, నాకు రోజూ పగళ్ళూ, రాత్రులూ కాలుషీట్లున్నై—ఈ సంగతి తెలుస్తే ఇచ్చివుండే దాన్ని కాను. ఎట్లా మై డియర్ ?" అని అడిగింది. అతను ఎన్నాళ్ళు అన్నాడు. కొన్నాళ్ళం దామె. పరవాలే దన్నా డతను. 'ఐతే, మీ మేడా అదీ నా పరం చెయ్యండి. నే నక్కడే ఉంటాను.' అంది. అతను 'యా'' అన్నాడు. ఇద్దరూ కలిసి అక్కడికి వెళ్ళిపోయారు. అతని సర్వస్వమూ తనపరం సుకే కున్నంతవరకూ కాల్‌షీట్లు అని బెదిరించి తిరగ సాగింది. ఆతర్వాత, 'గోవిందో గోవిందా' అని అతన్ని పొమ్మని తన స్వభర్తతో ఆ మేడలోనే కాపురం చెయ్యసాగింది. కోటీశ్వరుడు ఏం చెయ్యగలడు ? అట్లాగా — మనమూ మనచిత్రంకోసం ఏవో పథకాలు వేదాం. చిత్రం పూర్తయేదాకా ఆమె మాటాడదు అందాం. ఆమెకో వ్రతం ఉన్నదంటే సరి'' అన్నాడు విశ్వాన్.

"అది సరేగాని—ఆమె మహా పతివ్రతగదా" అన్నా

"ఏమె ?"

"ఆ హాలీవుడ్ ఆమె. తన పతినితప్ప అన్యుని దరిచేరనీయకుండా అన్యుని ఆస్తి హస్తగతం చేసుకోగలిగింది...ఆమెకూ జై" అని అరిచాను.

"ఇంక పద. నిన్ను పరిచయం చేస్తాను."

"ఈ గుడ్డలతోనే" అన్నాను. అతను ఏదో నా చెవిలో చెప్పాడు. ఇద్దరమూ కలిసి లాండ్రీలో శుభ్రమైన గుడ్డలు అద్దెకు తీసుకుని, డొక్కుకారొకటి కట్టించుకుని బుర్రమని అతని యింటి ముందు దిగాం అతని యిల్లు పాతకట్టడం. ఖవ తలకు చూట్టానికి చాలా పాడయిపోయి శిథిలావస్థలో ఉన్నట్టు కనిపించింది. లోపల చాలా బావుంది అందంగా, చక్కగా ఉంది. అతనూ అట్లానే ఉన్నాడు — చింకిచొక్కా వేసుకుని. కాని లోలోపల చాలా తెలివైనవాడట !

విశ్వాన్ నన్ను పరిచయంచేశాడు. అతనిపేరు రత్నాలు. అతన్ని కలుసుకోవటంలో నాకు సంతోషం అని అతనితో అన్నాను అతనూ ఆమాటే అన్నాడు

"ఏం పిక్చరు తియ్యాలనీ ?" అన్నాను

"శకుంతల లాంటి పిక్చరు డాన్సులూ, నృత్యాలూ కావాలి" అన్నాడు రత్నాలు

అబ్బో ! చాలా ఊహాలే అనుకున్నాను.

"హీరోయిన్ యింటికి పోదాం లెండి" అన్నాడు విశ్వాన్.

రత్నాలు లేచి లోపలకు వెళ్ళి గుడ్డలు మార్చుకుని సెంటూ గింటూ పూసుకుని వచ్చాడు—టెంగు, పూల—రంగళ్ళల్లే. ఇంత మంచి డ్రెస్సులూ లోపల ఉంచేశాడన్నమాట !

"చూడండి రత్నాలుగారూ, మీ పేరు మార్చి—అంటే పెద్ద మార్పేం ఉండదు. 'లు' తీసేదాం. మిస్టర్ రత్నా ... అందాం" అన్నాడు విశ్వాన్.

"పేరు మార్చుకుంటే మాత్రం నా గుణాలు నావేగా" అన్నాడు.

రత్నా—"వెనుకటి కథలాగా."

"ఏమిటండీ ఆ వెనకటి కథ ?" అన్నాను.

"ఏంలేదు. వెనకటికి—నే చూళ్ళేదు సుమండీ. చెప్పుకోటమే. బొంబాయిలో అనుకుంటాను. శీలా అని ఒకామె ఉండేది. ఆమె భర్తను వదిలేసి ఒంటరిగా లేచిపోయింది — ఒకనాటి అర్ధరాత్రివేళ. తెల్లారేసరికి బొంబాయిలో మకాం పెట్టింది. ఆమెకు సినిమా పిచ్చి. సినిమాలో వేషాలు వెయ్యాలని మహా ఇదయ్యేది. ఎవరూ ఇచ్చేవాళ్ళు కాదు.

—51 వ పేజీ చూడండి



# ప్రపంచ ప్రముఖులు-5

**పంచశీలను ఇంచుమించు అందరూ మర్చిపోయారు. మొన్న మొన్నటిదాకా మిత్రదేశం అనుకున్న చైనా మనపట్ల విపరీతమైన వైరం చూపుతున్నది. దీనికి ప్రత్యేకమైన కారణం ఏదీ చెప్పలేము కాని, చైనా, భారత దేశాల మధ్య విభేదాలు ఎప్పటికైనా బయటపడేవేమో!**

చైనా—ఇండియాలు రెండూ నిరుపేద దేశాలు. రెండూ ఆర్థికాభివృద్ధి కోసం తీవ్రమైన కృషి చేస్తున్నాయి. అయితే భారతదేశం ప్రజాస్వామ్యపద్ధతులు అవలంబిస్తున్నది. చైనా నియంతృత్వాన్ని ఎన్నుకున్నది. అయినప్పటికీ కమ్యూనిస్టుప్రభుత్వం అనుకున్నంత అభివృద్ధి సాధించలేకపోయింది దేశంలోని క్లిష్టపరిస్థితులు నేటి చైనా విదేశాంగవిధానాలకు ముఖ్యకారణమనికూడా కొందరంటారు కాని దూరదృష్టితో ఆలోచించినట్లయితే ప్రజాస్వామ్య పద్ధతులు అవలంబించే దేశానికి, నిరంకుశంగా పరిపాలించే ప్రభుత్వానికి నిజంగా పొత్తు కుదరటం కష్టం అనిపిస్తుంది

చైనాలో వ్యవసాయమే ప్రధానమైన వృత్తి. అచ్చు రష్యాలోవలె ఇక్కడ విప్లవం జరగటం కష్టమని మావ్—సి—టుంగ్ నిర్భయంగా చెప్పటమే కాక, ఆచరణలోకూడా వ్యవసాయదారులకే విప్లవంలో ముఖ్యపాత్ర ఇచ్చాడు అవసరాన్ని పట్టి కమ్యూనిస్టుపార్టీ కూమింటాంగ్‌తో కూడా పొత్తు కలిపింది. కాని నేడు రష్యానాయకులు కొందరు కేవలం విప్లవాత్మకమైన పద్ధతుల ద్వారానే పార్టీ అధికారానికి రానవసరంలేదని చెబుతున్నసమయంలో, చైనా ఇంకా ఎప్పుడో లెనిన్ చెప్పిన సిద్ధాంతాలనే అనుసరించాలని అనటం మావ్—సి—టుంగ్ భావాలలో కలిగిన మార్పులకు అనుగుణంగానే ఉందని ఊహించవచ్చు. కొంతకాలంగా మావ్—సి—టుంగ్ విమర్శలు సహించటంలేదని వినికిడి.

చైనా కమ్యూనిస్టుపార్టీ ఆంతరంగిక వ్యవహారాలలో ఇతరులు జోక్యం కలుగచేసుకోటం అసంభవం. కాని, చైనా ప్రపంచంలోకల్లా పెద్ద దేశం. చైనాతో వైరం పెట్టుకోటం ఎవరికీ శ్రేయస్కరం కాదు. అరవైకోట్ల ప్రజలుకల ఈ దేశం వెంటనే ఐక్యరాజ్యసమితిలో చేరేట్లు చేయటం అందరి కర్తవ్యం. ★

# యువతుల సమస్య

**"చిత్ర"**

నాకసలు పేరంటాలకి వెళ్లాలంటేనే ఒకవిధమైన చికాకు చదువుకున్నవాళ్ళంతా ఇలాగే అంటూండడం ఒక 'స్టయిల్' అయిపోయిందని అంటారేమో! అలాకాదు పేరంటానికి వెళ్లితే అందరినీ ఒకేవిధంగా పలకరిస్తే మనకేమీ కష్టమనిపించదు కాని, చదువుకున్నామనేటప్పటికి, అందులోను, చదువుకొని ఉద్యోగం చేస్తున్నామనేటప్పటికి, అంతా అదోలా చూస్తారు. అసలు పలకరించడమే—ఈసడింపుగా మాట్లాడుతారు కాని, పేరంటాలపట్ల ఇంత విముఖభావం ఉన్నా, ఆరోజు వెళ్లక తప్పిందికాదు సుశీల బలవంతం చేసింది "చూడు చిత్రా, వాళ్లంతగా పిలిచారు వెళ్లకపోతే బాగుండదు పైగా 'ఈ ఉద్యోగస్థులంతా ఇంతే అహంభావం ఎక్కువ' అని జమకట్టేస్తారు ఫరవాలేదు పద వెడదాం" అంది ఇద్దరం బయలుదేరాం కాని, ఆరోజు పేరంటానికి వెళ్ళకపోతే, ఈ వ్యాసంలో నేను వివరించిన సమస్య నా దృష్టిలోకి వచ్చేదే కాదేమో! కనుక ఆ వెళ్లడం 'బ్లెసింగ్ ఇన్ డిస్‌గైస్' అయింది

మామూలుగా ఎవ్వరూ పలకరించకపోయేటప్పటికి ముభావంగానే కూర్చున్నాను ఇంతలో సుశీల ఒకావిడను పరిచయంచేస్తూ, "నే నారోజన చెప్పానే, ఈ ఊరికి ఇటీవల వచ్చిన జూనియర్ ఇంజనీరుగారి భార్య—ఈవిడే—కమల" అంది అనుకోకుండా 'నమస్కారం' అన్నాను ఆవిడ ప్రతి నమస్కారంచేసి, ఏవో కుశలప్రశ్నలు వేసింది కాని, అంతసేపూ ఆవిడనే చూస్తున్న నాకు ఈవిడను ఎక్కడో చూసినట్టుందే అనిపించింది దాంతో ఊరుకోక, నేనే కలగజేసుకుంటూ "ఏమండీ, మీరెప్పుడైనా బెంగుళూరులో ఉండేవారా?" అని అడిగాను

"ఇటీవల కాదండి 8, 10 ఏళ్లక్రితం ఉండేవాళ్ళం" అంది

"అదే. అదే అయితే ఒకమాటడగుతాను మీ ఇంటిపేరు మైదవోలు వారేనా?"

"ఆ మా పుట్టింటివారి ఇంటిపేరదేనండి"

నా సంతోషం కట్టలు త్రెంచుకుంది ఇంకెప్పుడూ కలుసుకోమని అనుకున్న పాతస్నేహితులను, ఎన్నెన్నో ఏళ్ల తరువాత అనుకోకుండా కలుసుకుంటే కలిగే అనుభూతి నాలో కలిగింది

"అయితే నే నెవరో తెలుసా మా ఇంటిపేరు గాదెవారు మీఇంటి ప్రక్కనే ఉండేవాళ్లం నేను, మీ అక్క శ్యామల క్లాసుమేట్సు" అని, ఆ సంతోషంలో గబగబా వాళ్లింటివాళ్ల సంగతులన్నీ అడిగాను ఎవరెవరు ఎక్కడెక్కడున్నది, ఏంచేస్తున్నదీ వివరాలు చెప్పింది

"అయితే ఇంతకూ మీ అక్క శ్యామలేంజేస్తోంది? వాళ్లఆయన. ...."

"ఇంకా తనకు పెళ్లికాలేదు. మరి నాన్నపోయాక తనే ఉద్యోగంచేసి, అందరినీ పైకి తెస్తోంది. నాకు మంచి సంబంధం వచ్చిందని పెళ్లి చేసారు" అంది. తరువాత కమలతో పిచ్చాపాటి మాట్లాడి పేరంటం నుండి వచ్చేసాం.

*　　*　　*

ఇంటికి వచ్చానేగాని, అంతవరకు నా కెప్పుడూ అంతగా తట్టని ఈ విషయం నా మనస్సులో, మెదడులో మెదులుతూనేవుంది "మా అక్కేగా సంపాదిస్తోంది నాకు ముందర పెళ్ళి చేసేశారు" అని ఇలా పెద్ద అమ్మాయిని ఒదిలి, చిన్నవారికి పెళ్ళిచేసిన ఉదాహరణాలన్నీ గుర్తుకు వచ్చాయి.

మార్పులకూ, సంస్కారాలకూ గురిఅవుతున్న సంఘంలో పరిణామంచెందేదశలో ఇలాంటి సమస్యలు సహజం వరుడుకోరే కట్నాలు, లాంఛనాలు ఇచ్చుకోలేక కొడుకులాగా చేతికంది, ఉద్యోగం చేస్తుంది కదా అని, ఆడపిల్లలను చదివించి, ఉద్యోగాలలో చేర్పించే తల్లితండ్రుల సంఖ్య రోజురోజుకీ పెరుగుతోంది ముఖ్యంగా పెద్దపెద్ద నగరాల్లో అది సహజం తన పరిసరాల్లో పరిస్థితులనుచూచి 'నేను చదువుకోవాలి సంపాదించాలి' అని అమ్మాయి ఆదుర్దాచెందడం కూడ సహజమే కాని, ఈ ఉద్యోగమనేది వివాహసమస్యకి శాశ్వత పరిష్కారమనుకున్నప్పుడే (తల్లిదండ్రులు) వస్తుంది చిక్కు కొద్ది రోజులు ఉద్యోగం చేశాక, తాను పెళ్ళాడాలని, గృహిణి కావాలనీ, ఆ అమ్మాయికి ఉంటుందేమో! మనం పెళ్లి ప్రస్తావనే తేవడంలేదే అని అనుకోరు పైపెచ్చు అన్నయ్యలకీ, చెల్లెళ్ళకీ, తమ్ముళ్ళకీ పెళ్ళిళ్ళుచేసే ప్రయత్నాలు చేస్తారు అంతేకాదు. తీరా చదువుకున్నాక, ఉద్యోగం చేస్తున్నాక, ఆ అమ్మాయికోసం వెదుకవలసిన వరుడి తాహతు కూడ ఎక్కువౌతుంది దాంతో సమస్యా పరిష్కారం ఇంకా కష్టం అవుతుంది

మా ఊళ్లో ఇలాగే ఓ కుటుంబంవుంది వాళ్ళమ్మాయికి, ఆ తండ్రి, తల్లి చాల సంబంధాలు చూచారు మొదట్లో ఏదీ కుదరకపోయినా, తరువాత రెండు, మూడు సంబంధాలు తీరా కుదిరే వరకూ వచ్చాయి కాని ఆపాటికి తల్లిదండ్రులకు అమ్మాయి చదివి ఉద్యోగం చేయాలన్న కుతూహలంతో (కొడుకులంతా ఎవరంతట వాళ్ళు భార్యామణులతో విడివిడిగా వెళ్ళిపోయారులెండి) కొద్దిలో పెళ్ళి పీళ్లే తప్పించేశారు తరువాత 'ట్రెయినింగ్' చదివించి ఉద్యోగంలో ప్రవేశపెట్టారు. మొదట్లో ఆ అమ్మాయి అంతగా బాధపడకపోయినా, చివరికి చాల క్రుంగిపోయింది ఇంతకీ వచ్చిన చిక్కేమిటంటే, ఏ అమ్మాయీ గట్టిగా తల్లి తండ్రులతో 'నాకు పెళ్ళికావాలి చెయ్యండి' అని చెబుతుంది చెప్పండి చెప్పినా, తగినవరుణ్ణి వెదికే సమస్య ఉందిగా! కట్నాలివ్వాలి పెళ్ళిఖర్చులు భరించాలి. కాకపోతే, సామాన్యకుటుంబంలో, అదుపులో పెరిగిన అమ్మాయికి తనంతట తానే కాబోయే భర్తను వెదుక్కునే సాహసం, స్తోమతూ ఉంటుందా? అసలే ఇరుగూ పొరుగూ అమ్మలక్కలు ఇలాంటమ్మాయిలనే వేలెత్తి చూపిస్తుంటారు. ఇక స్వతంత్రంగా ప్రవర్తిస్తే సరేసరి. ఇలాగ, తనంతట తానేమీ చేయలేక తల్లి దండ్రుల అసమర్థత (?) ను వేలెత్తి చూపలేక బాధపడుతుంది

ఈ సమస్య అంత తీవ్రంగా లేకపోయినా, ముఖ్యంగా మన ఆంధ్రదేశంలో ఇప్పుడిప్పుడు ప్రబలుతోంది కేరళప్రాంతం తమిళనాడులలో ఈ స్థితిజే కొంతవరకు దాటిందని చెప్పొచ్చు కాని, దేశమంతటా పూర్తిగా పరిష్కారం కాలేదు — ఇంతలో కాదు

ఈ విషయంలో తల్లిదండ్రులను వేలెత్తిచూపి లాభంలేదు వాళ్ళుమాత్రం ఏంచేస్తారు పాపం! అటు ఆర్థికపరిస్థితులను ధిక్కరించలేరు ఇటు, అమ్మాయిని స్వతంత్రించి ప్రవర్తించమని నోరారా చెప్పలేరు

క్రమక్రమంగా మొగపిల్లలతోపాటు ఆడపిల్లలకి కూడ కొంత స్వతంత్రం ఇవ్వాలి కాని, మొదట్నించి వాళ్ళని పెంచడంలోనే "ఇది తప్పు దీని మూలాన ప్రతిఫలం ఇలా ఉంటుందని" వ్యంగ్యంగా నేర్పి, తప్పటడుగు వేయకుండా చూచుకోవాలి. అప్పుడు వాళ్ళు కొంతవరకైనా తమకు నచ్చిన వారిని పెళ్ళాడటానికి ప్రయత్నిస్తారు. అంతేగాని, "ఆ అమ్మాయికి పెళ్ళికాలేదు ఈ అమ్మాయి ఇలా అందరితో ఫ్రీగా మాట్లాడుతుంది" అని వేలెత్తి చూపిస్తుండడం తప్పు

ఈ సమస్యను అన్ని కోణాలనుండి చిత్రించలేకపోయానేమో అనిపిస్తుంది వ్రాయాలంటే ఇలాంటివి రోజూ చూస్తున్న ఉదాహరణాలు వందలు ఉన్నాయి కానీ, అన్నీ వ్రాయడం అంత ఉచితం కాదేమో! ఇటు సమాజపరిస్థితులమూలానా ఆడపిల్లలకి పెళ్లి చేయలేక, ఒకవేళ అమ్మాయి అదృష్టం కొద్దీ (అందరివట్లా 'అదృష్టం' అనటానికి వీల్లేకపోయినా) ఏదో తగిన అబ్బాయిని తల్లి దండ్రులతో చెప్పి వివాహం ఆడడానికి ప్రయత్నించినా, అడిపోసుకొని, అమ్మాయినిహింసించినవాళ్లెందరో! ★






# వనితావాణి,
# ఆంధ్రసచిత్రవారపత్రిక,
# 7, తంబుచెట్టివీధి,
# మద్రాసు-1

## కట్నాల—వేలంపాట

ఈరోజుల్లో కట్నాలు ఇవ్వుకోలేని కుటుంబీకులు చాలామంది అసలు కట్నం విషయం ఎక్కువ చెప్పలేక ఏదో వంకపెట్టుతుంటారు.

తల్లాప్రగడ సత్యవతి (కోనాల)

* * *

నేటి పరిస్థితులను వారు చక్కగా వివరించారు. నిజంగా ఈ రోజులలో కట్నాలు వేలంపాటలుగుటు నిస్సందేహము. తుమ్మల బుల్లెమ్మ (నిడుబ్రోలు)

* * *

కట్నాలు తీసుకోవడంలో వరుడుకంటె అతని తల్లితండ్రులకు ఎక్కువ బాధ్యతగా ఉంటుంది. వరుడుకట్నంవద్దంటే అతని తలితండ్రులుఅంటారు కదా! నిన్ను ఇంత పెద్దచేసి ఇంత చదువు చెప్పిస్తే అంత డబ్బు ఎక్కడ తేవాలి. ఆ డబ్బంతా ఈ కట్నం రూపాన తీసుకోవాలి అంటారు.

కె. సుజాత (మోరి.)

* * *

కట్నాంకి మగవారికన్నా ఆడవారే ఎక్కువగా ఆశపడ్తారన్నది ముమ్మాటికి నిజం! ఈ కట్నాల విషయంలో ఆడవాళ్ల మనస్తత్వాలు వివిధరకాలుగా ఉంటాయి. ఈమధ్య మాకు తెలిసిన ఒకావిడ తన కొడుక్కు పెళ్లిచేసింది. ఆ అబ్బాయి పట్టుబట్టి కట్నం తీసుకోలేదు. అది తమ కుటుంబంలోనే జీర్ణించుకొనిపోయిన సంస్కారం అని ఆమె గర్వంగా చెప్పుకుంటుంటే విని ఎంతో సంతోషించేవాళ్ళం. కానీ, ఇప్పుడు తన కూతురికి వరుణ్ణి చూస్తుంది. తనవద్ద ప్రతి మంచిసంబంధాన్ని 'కట్నం పలుగురి కన్నా ఒక వేయి ఎక్కువ ఇస్తా'నంటూ తనవైపుకు ఆకర్షించుకోవటం చాల ఆశ్చర్యంగావుంది. "ఏంచేస్తా మమ్మా డబ్బుకోసం దాని బ్రతుకు నాశనం చేయ లేము" అంటుంది. తీరా ఇప్పుడు అందరు అను కోవడం ఏమిటంటే ఆవిడ కోడలు తనతండ్రికి ఒక్కగానొక్క కూతురట! ఆయన ఆస్తికి వారసు రాలు!! శ్రీమతి ఎస్. కమలారామం (విజయనగరం)

* * *

"కట్నాలవేలంపాట"పై పద్మగారు మంచి ఉదాహరణ లిచ్చారు. ఈకాలంలో మా అబ్బాయికి ఇంత కట్నం ఇస్తామని వస్తున్నారు అని చెప్పుకోవడం తలిదండ్రులకు గొప్పతనం, అలవాటుకూడ అయినది. కాని తమ కన్నకొడుకుకు ఒక ధర ఏర్పాటు చేస్తే బేరగాళ్ళు బేరమాడి కొంటున్నారని కొడుకును డబ్బుకమ్ముకొంటున్నామని గ్రహించలేక పోతున్నారు. ఈ కట్నం తీసికోమని చెప్తానే కొంత మంది లోపాయకారిగా ఓ వెబుకు విసురుతారు. "మీ అమ్మాయికి ఎంత సొమ్ము పెట్టుకోవాలో మీకు తెలియదూ" అంటూ. ఈ కట్నపిశాచికి నశింపులేదు. మగపిల్లలకన్న తలిదండ్రుల కాశ కంతుండదు. ఆడపిల్లల తండ్రుల అవస్థలకు హద్దుండదు. వరకట్ననిషేధం అమలులోకొచ్చినా, చాటుగా కట్నపిశాచము స్వైరవిహారం చేస్తూనే వుంటున్నది. ఆదర్శప్రాయంగా ఏ యువకుడైనా కట్నం నిరాకరిస్తే పాపం! ఆ అమ్మాయికి ఆ జన్మాంతము దెప్పిపొడుపులూ, చీవాట్లు తప్పవుకదా. ఈ కట్నం సమసిపోయే దెప్పుడో! ఆడపిల్లల తలిదండ్రులకు శాంతి కలిగే దెప్పుడో!

కుమారి పాతూరి సుమతి (కూచిపూడి)

* * *

అనాటి వరవిక్రయంకి దీనికి తేడా ఏమిటి? ప్రభుత్వ చట్టాలలో ఏం ఉంది? మనుష్యులలో మార్పు రావాలి! కట్నాలు చాలకపోతే వాళ్ళ చెప్పే మాటలు మరీ చిత్రం. "మావాడు ఇప్పుడప్పుడే పెళ్ళిచేసుకోడు", లేకపోతే, "మా అమ్మాయికి అవందే అబ్బాయికి చెయ్యము" అదీ కాకపోతే "ఇంకా పెద్ద ఉద్యోగం" ఇలా ఉంటాయి. మరి ఆ మాత్రానికి చూడరావడం శుద్ధదండుగ.

లక్ష్మీ మ్రపాప (చక్రధర్‌పూర్)

* * *

పద్మగారు వ్రాసిన కట్నాల వేలంపాట చక్కగా వుంది. ప్రస్తుత పరిస్థితులలో మధ్యతరగతి కుటుంబీకులు వరకట్నాలవలన చాల బాధపడుతున్నారు. ప్రభుత్వం ఆంక్షెట్టు గావాలవల దీనిని నిషేధించగలము. క్రమంలో మార్పువచ్చినగాని వర కట్నములు తొలగిపోవు. చదువుకొని విజ్ఞానం సంపాదించినవారే దీనిని ప్రోత్సహించుచున్నారు. ప్రభుత్వము శాసనముచేసి కఠినముగా శిక్షించిన దీనిని నిర్మూలించుట సాధ్యమగును. వరకట్నములనుగూర్చి పద్మగారు విపులంగా వ్రాయలేదని అనుకొంటు న్నాను.

మస్నాం రాజ్యం అప్పిరెడ్డి (జాలకల్లు)

* * *

పద్మగారు వ్రాసిన "కట్నాలు వేలంపాట" వ్యాసం చాలా బాగుంది. ఆ వ్యాసము చదివినంత సేపు నేను విన్న కొన్ని కట్నాల సమస్యలు పదేపదే జ్ఞాపకము రాసాగేయి. ఈ కట్నాలబాధలు పడలేక ఎంతోమంది తల్లితండ్రులు ఎన్నో బాధల ననుభవిస్తున్నారు. నిజంగా అది ఆడబిడ్డ కన్నవారికే తెలుస్తుంది. కన్నవారి బాధలు చూడలేక, బ్రతుకు మీద తీపిలేక కొందరు ఆత్మహత్యలకు పూనుకుంటు న్నారు. మా దాపులో ఇలాగే ఒక అమ్మాయి ఆత్మహత్య చేసుకుంది. ఏనాటికైనా ఈ "కట్నపిశాచి" వదులుతుందా? అంటే సమాధానం దొరకటంలేదు. ఈ కట్నాల నిషేధముకొరకు ప్రభుత్వ మొక చట్టాన్ని అమలుజరిపింది. కాని ఇది ప్రాధాన్యత అంతగా ఇవ్వలేదు. చాటుమాటుగ వివాహానికి ముందే పుచ్చుకొంటున్నారు ఈ కట్నం. పాపం తల్లిదండ్రులు ఏంచేస్తారు? తమ కూతురి కాపరము బాగుపడాలంటె ఇవ్వక తప్పదు. అందుచేత చట్టాలు పూర్తిగా అమలుజరపబడాలంటే ప్రభుత్వమేమీచేయలేదు. మనలో (సంఘం) మనమే ఈ సమస్య పరిష్కరించాలి. మన సంఘములో ఈ సమస్య తీరేవరకు ఆడబిడ్డల ఆత్మహత్యలకు అంతుండదు. ముఖ్యంగా స్త్రీలంతా కలిసి, వివాహముమీదే ఆధారపడక తమ కాళ్ళమీద నిలబడగలిగితే అనాటికైన ఈ 'వర కట్నం' నిషేధించబడగలదు.

దేవగుప్తాపు సూర్యకుమారి (హన్మకొండ)

## ఒంటరి ప్రయాణాలు

"ఒంటరి ప్రయాణాలు" బాగానేఉందికాని రచయిత్రి "అసిస్టెంట్ స్టేషన్ మాస్టరు" గురించి చాలా ఇదిగా వ్రాసారు. ఎంత ఎ. ఎస్. ఎం. అయినా ఆమె అడిగినదానికి జవాబు చెప్పలేడా? లేక రచయిత్రి ఊహించి వ్రాసారా? బోధపడలేదు. రైలుబళ్లరాకపోకలే అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్ల" డ్యూటి. ఎ. ఎస్. ఎమ్. చెప్పిన మాటలు రచయిత్రికి బోధపడలేదో అని నా అనుమానం.

ఎ. ఎస్. రాజా (అసిస్టెంట్ స్టేషన్‌మాస్టరు)
అండాల్ జంక్షన్, ఈస్టర్నరైల్వే

* * *

శ్రీమతి శశికళగారు వ్రాసిన "ఒంటరి ప్రయాణాలు" వ్యాసం చాల ఉత్ప్రేక్షగా కనబడుతుంది. అవసరమున్నప్పుడు మగవారు ఆడువారికి, ఆడువారు మగవారికి సహాయపడుటలో ఏ వింతయూలేదు. మరియు అట్టి పరస్పర సహాయముచేయుట నాగరికతా చిహ్నము. కనుక ఆడువారు ఏదైన తెలియని విషయమై అడిగినప్పుడు మగవారు సలహాలిచ్చుట వారి కర్తవ్యమేగాని, ఆడువారు చక్కగా అలంకరించుకొన్నందువల్ల వారు (మగవారు) అట్టి సహాయము చేస్తారని భావించడం మిక్కిలి శోచనీయము. శశికళగారు రైలు వెళ్ళు సమయాలను ఎప్పుడును పరిశీ

చెప్పలేదని వ్రాశారు 'అసిస్టెంట్ స్టేషన్ మాస్టరు' కూడ బండివెళ్ళు సమయాన్ని సరిగా చెప్పలేదని ఆమె వ్రాశారు. సాధారణముగా ఎందరో చదువురాని ప్రయాణీకులుకూడ ఇట్టి విషయాలను రైల్వే ఉద్యోగుల నడిగి తెలుసుకొని వారి ప్రయాణాలను సుఖాయాసంగా జరుపుకొంటారు. అయితే శ్రీమతి శశికళగారు చదువుకొన్నవారయ్యు ఇట్టి తొందర బడి పొరపాటు చేశారంటే మిక్కిలి శోచనీయము. రైలుబండ్ల కాలపట్టికలను చూచియైనను, రైలు వెళ్ళు సమయాన్ని ఆమె తెలిసికొనగలిగియుండ వచ్చునుకదా! ఆడవాళ్ళున్న రైలుపెట్టెలో సాధార ణంగా ఏ మగవాడైనను షర్టు తీసి పోజులు కొట్టడు. ఒకవేళ అలాగయియుంటే, ఆ మగవాడు ఆడువారి రైలుపెట్టెలో కూర్చుండియున్నది తెలియక, బహుశా ఎచ్చటనుండియో తొందరగా వచ్చిన ఐడలిక చేత అలా చేసియుంటాడేమో! అయినను, "నవ నాగరికత" అను పేరుతో ఖర్మము వచ్చినట్లు ఇట్టు లను ధరించి వీధులలో పోజులుకొట్టే ఆడువారికైనను (కొందరు) ఇది వయమేనని తోస్తుంది.

మీరు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "వనితా లోకం" అను శీర్షికక్రింద వ్యాసాలను ప్రచురిం చుటకు కొసగిన అమూల్య అవకాశాన్ని సోదరీమణులు సద్వినియోగంచేసుకోవాలని నా ప్రార్థన. కేవలము మగవారిని విమర్శించు ఉద్దేశముతోనే "అల్లరి ఆలుకలు", "ఒంటరి ప్రయాణాలు" వంటి వ్యాసాలను వ్రాయక ఉపయోగకరమైన సంసార సంబంధ వ్యాసాలను సోదరీమణులు వ్రాయాలని నా మనవి.

ఎం. ఎల్. అనంతరామన్ (మద్రాసు)

* * *

ఒక్కొక్కసారి ఒంటరిగా ప్రయాణం చెయ్యక తప్పదు. అలాంటప్పుడు అప్పుడప్పుడు ఇటువంటి సంఘటనలు జరగడము సహజమే.

మద్దాల ఇందిర (కాకినాడ)

## స్నే హం

మీరు వ్రాసినట్లు, బంధువులకన్న స్నేహమే గొప్పది. నా అనుభవంమీద స్నేహంగురించి ఇలా వ్రాస్తున్నాను. మేము కాళహస్తినుంచివచ్చి తిరుపతి లో స్థిరపడ్డాము. మాకు కావలసినంతమంది బంధు వులు యున్నారు. కాని, ఒకరివల్ల సహాయము లేదు. వాళ్ళందరు మా ముందర పొగడి వెనకాల దూష్యం చుకొంటారు. మావారికి తిరుపతిలో స్నేహితులు ఎక్కువ. మావారి వ్యాపారానికి సొంతబంధువులు సహాయము చేయకున్నను వారి స్నేహితులు కొందరు వ్యాపారానికి తోడ్పడి ప్రాణమునకు ప్రాణమిచ్చు వారుగ యున్నారు. కాబట్టి బంధువులకన్న స్నేహమే గొప్పదని ఎస్. రంగారాణిగారితో ఏకీభవిస్తున్నాను.

శ్రీమతి బాలుగంటి కమ్మారి రాణీ (తిరుపతి)

* * *

'స్నేహం' వ్యాసరచయిత్రి రంగారాణిగారితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. వాళాగే చాలామంది ఏకీభవిస్తారనటంలో సందేహంకాని, అతిశయోక్తి కాని లేదు—ఎందుచేతనంటే కాచి వడపోసిన నిత్య సత్యాల అనుభవాలను ఎవరూ కాదనలేరు! ఎవరికి సందేహములేదు!!

ఎస్. శాయాదేవి (వ్యాఘ్రేశ్వరం)

* * *

వ్యాసం నాకు చాలా నచ్చింది బాంధవ్యముకన్నా స్నేహమే గొప్పదనుటలో నేనుకూడ ఆమెతో ఏకీభ విస్తున్నాను. ఆమెకు నా ధన్యవాదా లర్పిస్తున్నాను.

బి. విజయ (శ్రీరంగపురం)

* * *

నిజంగా స్నేహానికి మృత్యువులేదు; కుల మత భేదాలులేవు. నాకు తెలిసిన ఒక ముస్లిం యువకుని, ఒక బ్రాహ్మణస్త్రీ వివాహం చేసుకొంది. ఇదంతా స్నేహం మూలంగానే జరిగినది. రంగారాణిగారు వ్రాసిన "స్నేహబంధంవలన మానవుల హృదయాలు కలియడమేగాక వారి ఆత్మలుకూడా పరస్పరం ఏక మౌతవి." అనిన మాటలు మరువరానివి.

కె. వరలక్ష్మి (గూడూరు)

* * *

వ్యాసం చాలా బాగుందికాని ఊళ్లో ఉన్నంత వరకు స్నేహితులు ఆదరణ, ఆప్యాయత చూపిస్తారు. ఐదిలీరీత్యా ఆ ఊరువదిలి ఇంకొక ఊరికివెళ్తే కష్టసుఖాలకు బంధువులు వస్తారుగాని స్నేహితులు వస్తారా!

ఆర్. అమ్మలు (శ్రీకాకుళం)

* * *

రంగారాణిగారు 'స్నేహం' గురించి మోతాదుగా, అతిశ్యోక్తిముకోపేరు. 'బాంధవ్యం—స్నేహం' అన్న రెండు పదాలపై కుపిళాలంగా వివరించినట్లయితే మరింత ఆహ్లాదకరంగా ఉండేది. స్నేహమన్నది అయాచితంగా ఏర్పడుతుంది. ఫలాపేక్షలేని 'స్నేహం' ముఖ్యంగా వ్యక్తుల విశ్వాలనసమన స్వత్వాలపై ఆధారపడిఉంటుంది. అందుకే 'చెడి స్నేహితుని ఇంటికి వెళ్ళమన్నారుగాని బంధువు ఇంటికి వెళ్ళమన్నారు. ఎప్పుడైనా కలిమిలేములు పంచుకొన టానికి స్నేహితుడు సిద్ధమౌతాడుగాని బంధువు సిద్ధపడడనేది నిత్యసత్యం. అందుకేకాబోలు "స్నేహితునికి బాంధవ్యంకంటే అత్యధికమైన ఆదృతి, విశిష్టత ఉంటుంది.

కృష్ణప్రియ (రూర్కేలా)

* * *

వ్యాసము చక్కగ నున్నది బాంధవ్యముకంటె స్నేహమే గొప్పదని నా అభిప్రాయము.

వై. లలితకుమారి (తిరుపతి) ★

# వంటలు
## గోధుమ లడ్డు

### కావలసిన వస్తువులు

| | | |
|---|---|---|
| గోధుమపిండి | ½ | అరాకు |
| చక్కెర | ½ | అరాకు |
| నెయ్యి | 1 | పలం |
| జీడిపప్పులు | 6 | |
| ఏలకులు | 3 | |

గోధుమలు దోరగా వేపి పిండి విసురుకోవాలి. అందులో ఒక అర అరాకు తీసి సిద్ధంగా ఉంచుకోవాలి. చక్కెర, ఏలకులు విడివిడిగా మెత్తగా నూరుకోవాలి. జీడిపప్పులు నేతిలో వేయించుకున్నాక, అన్ని వస్తువులు గోధుమపిండిలో కలుపు కుని నిమ్మకాయంత ఉండలుగా చేసుకోవాలి. ★







వీళ్లకి నీఫా మిఠాయిలు ఇవ్వండి
ఇవి చాలా రుచికరంగా ఉంటాయి

తిక్క శంకరయ్యకు
తికమకలు
లేవు



సోమయ్య తానుకూడా తిక్కశంకరయ్యవలె ఇల్లుకట్టాలని నిశ్చయించాడు. వెంటనే ఎల్. ఐ. సి. ఏజెంటువద్దకు వెళ్లాడు.



సోమయ్య యీనాడు జీవిత భీమా పట్టాదారుడు. కొద్ది సంవత్సరాల లోనే తిక్కశంకరయ్యలాగే సోమయ్యకూడా ఇ టు క. సున్నంతో కట్టిన బంగారా పెంకుల యింటికి అధిపతి అవుతాడు.

జీవిత భీమాకు
ప్రతిగా మరొకటిలేదు

ASP/LIC-85/TE




౧౧

## జరిగిన కథ

ఐదు వాటాల లోగిలియిల్లుగలావిడ వరసమ్మగారు మనుమడు సూర్యానికి తల్లీ తండ్రీ తానే అయి పెంచింది. శంకరం గారు హెడ్డార్కుగావున్న కంపెనీలో చేరిన సూర్యానికి ఆయనంటే గురి. ఆ ఐదు వాటాల లోగిలిలో రకరకాల కుటుంబాలున్నాయి అందులో సాంబశివంలలితాంబా వాళ్ళ రాజ్యలక్ష్మికి వరసమ్మగారంటే చనువూ, భక్తీ. ఆపిల్లకి సూర్యం బావంటే సిగ్గూ, నిర్మలంటే స్నేహం. సాంబశివం గారికి గతం గాయం. అదివరకు తెలియని మేనమామ జయరావు రాక, పరిచయం సూర్యానికి గతమంటే భయాందోళనలను కలిగిస్తుంది. సూర్యం నిర్మలకి పాఠాలు చెబుతూంటాడు. జయరావు కూతురు మీనాక్షితో సూర్యానికి చనువు ఏర్పడుతుంది. సూర్యం, నిర్మలలనుగూర్చి లోగిలో గుసగుసలు బయలుదేరుతాయి. నూతిగట్టున కాలు జారిపడిన వరసమ్మగారికి నిర్మల ఉపచారం చేసి, ఆమె మెప్పుపొందుతుంది. సాంబశివం గారి ఇంటికివచ్చిన బంధువులు లలితాంబకు రాజ్యలక్ష్మినిగూర్చి కొన్ని తెలియని విషయాలు చెబుతారు.

లౌక్యం తెలిసినవారు ప్రాప్తకాలజ్ఞులౌతూ, దైవికమైన ఆకస్మిక సంఘటనలనుకూడా, తమ మేలు కొరకే త్రిప్పుకోవాలని చూస్తారు. అవిరిగా వున్న ద్రవం అది ద్రవీభవించేదాకా రంగు గ్రహించడం యెంత కష్టమో జయరావుగారి ఆలోచనలను కూడా ముందుగా ఊహించడం యితరులకు సాధ్యంగాదు.

అయితే పాతికేళ్ళు అతగాడితో కాపురంచేసి కష్టం సుఖం పంచుకుని పిల్లా పాపా పుట్టేకా, సుందరమ్మగారు తనభర్త తలంపులను గ్రహింత గలదనే చెప్పాలి

ఒంటరిగా వచ్చిన భర్తను ఆమె, చిరునవ్వుతో యెదుర్కొని "అమ్మాయేదండీ ? .... కొంపతీసి అక్కడే వదిలేసి వచ్చేరా ! ఏం !" అన్నది

జయరావుగారు వరసమ్మగారు పడిపోవడాన్ని తన మేలుకే నన్నట్లు భావించి, పిల్లను వదిలి రావడానికిగల కారణాలు భార్యకు వివరించి వ్యాఖ్యాన సహితంగా చెప్పేడు.

"సరిపోయింది .... చదువు సంధ్యా ఇన్నీ చెప్పించిన పిల్ల, మంచానపడ్డ మనిషి కేం చాకిరీ చేస్తుందండీ ... అందులోకీ దానికి జరిగిన గారాబం యింతా అంతానా?" అని సాగదీసింది సుందరమ్మగారు.

"అదీగాక, ఇది అతగాణ్ణి నచ్చుకుంటుందనీ, అతగాడు మన పిల్లను సుఖపెట్టగలడనీ ధైర్యం

—44వ పేజీ చూడండి

# హాయవాతా అద్భుతగాథ

## మూలం: లాంగ్ ఫెలో

## అనుసరణ: పి. గణపతిశాస్త్రి



### జరిగినకథ

జాబిల్లి చిన్నారి భార్య నోకోమిస్ ముద్దులకూతురు వెనోనా. పడమటిగాలి ఆకర్షించినవాడై వెనోనాను మోసగించి మటుమాయమవుతాడు. వెనోనా హాయవాతాను కని దిగులుతో మరణిస్తుంది. నోకోమిస్ మనుమణ్ణి చేరదీస్తుంది. హాయవాతా క్రమక్రమంగా పెరిగి పెద్దవాడవుతాడు. ఒకరోజున భూతవైద్యుడొకడు హాయవాతాకు జింకచర్మంతో తయారుచేసిన విచిత్రకవచాలు, పాదరక్షలు ఇస్తాడు. వాటిని ధరించి అతడు ఎందరెందరో వీరులను ఓడిస్తాడు.

అంత పరాక్రమశాలి అయినా తన తల్లిదండ్రు లెవరో తెలియక హాయవాతా మనోవ్యాధికిలోనవుతాడు. నోకోమిస్ జరిగిన కథ అంతా పూసగుచ్చినట్టు చెబుతుంది. హాయవాతా పడమటిగాలిమీద పగతీర్చుకోవాలని బయలుదేరివెడతాడు. ఆదుష్టుడికి దేనివల్ల ప్రాణభయం కలుగుతుందో తెలుసుకుంటాడు. సమయం కనిపెట్టి హాయవాతా వాడితో తనతల్లి సంగతి ప్రస్తావిస్తాడు. పడమటిగాలి అం[illegible]ట్టు సమాధానం చెబుతాడు. హాయవాతా వాడితో యుద్ధం చేసి ఓడిస్తాడు. పడమటిగాలి వెనోనాకు తాను చేసిన ద్రోహాన్ని ఒప్పుకుని పరితపిస్తాడు. తన రాజ్యాన్ని కొడుక్కి అప్పగిస్తాడు. హాయవాతా కొంతకాలం తండ్రిదగ్గర ఉండి అటుతరవాత నోకోమిస్ చెంతకి ప్రయాణమవుతాడు. దారిలో అతనికి ఇయాగూ కనిపించి మకోరిసూ సంగతి చెబుతాడు. వాడిదగ్గరఉన్న బాణాలు తెచ్చుకునేందుకు హాయవాతా డకోటా దేశానికి వెడతానంటాడు. ఇయాగూ అతణ్ణి ఆపాలని ప్రయత్నించి విఫలుడవుతాడు. హాయవాతా ఆ రాజ్యంలో ప్రవేశించగానే అక్కడొక సరస్సు, అందులో ఒక చక్కని కన్య కనిపిస్తారు. ఆమె మకోరిసూ కుమార్తె మిన్నెహాహా. హాయవాతా తను శత్రువర్గంలోవాడని తెలుసుకుని తన తండ్రి రాకముందే వెళ్లిపొమ్మని ఆమె అతడికి చెబుతుంది.

---

మిన్నెహాహా అలాగ మాటి మాటికీ ప్రాధేయపడినా హాయవాతా ముఖంలో ఎక్కడా నదురు బెదురు కనిపించలేదు. నిశ్చలంగా నిర్భయంగా ఆమెవైపు చూస్తూ అన్నాడు:

'మిన్నెహాహా! ఎంత చక్కని పేరు నీది! ఇది వినగానే నాకు వేయి పిల్లనగ్రోవులసంగీతం ఒక్కమారుగా విన్నట్టనిపించింది! నీవంటి అందాలరాణిని నే నింతకుమును ఎక్కడా చూడలేదు! మీ తండ్రి ఇక్కడికి వస్తేమాత్రం భయమేముంది! రానీ! ఇక్కడినించి పారిపోయి జీవచ్ఛవంలాగ జీవించడం కన్న నీవంటి సౌందర్యవతిని కన్న ఆ తండ్రి చేతిలో పడి చచ్చిపోవడమే మేలు!'

'పోనీ! పారిపోకపోతే అదిగో ఆ పొదరింటిలో నయినా దాక్కో! నా మాట విను! ఇక ఒక క్షణమయినా ఆలస్యంచేస్తే ప్రాణాలు దక్కవుసుమా! అదిగో! ఆయన ఇటే వస్తున్నట్టున్నారు! వెళ్లు! వెళ్లు'

'పోనిలే! ఇక నీమాట కాదను చెప్పను లే! మాటిమాటికీ నీ మాటలు వినాలని అలాగన్నాను. అంతే!'

అని హాయవాతా అల్లిబిల్లిగా

—42వ పేజీ చూడండి



# వెండిమబ్బు

కన్నడ మాతృక: త్రివేణి
అనువాదం: శర్వాణి

## జరిగిన కథ

'వెండిమబ్బు' యజమాని సదాశివరావుగారికి ఇందిర ఒక్కగానొక్క కూతురు. పై చదువుకు అమెరికా వెళ్లాలని కలలు కంటున్న మోహనుడు రావుగారి సిఫార్సు కోసం వచ్చి, నిరాశతో వెళ్లిపోతాడు. ఇందిరను మోహనుడికిచ్చి పెళ్లిచేస్తే సొంత ఖర్చుమీద అతణ్ణి అమెరికా పంపవచ్చునని రావుగారి భార్య లలితమ్మగారి అభిప్రాయం. ఈ సూచన రావుగారికి నచ్చకపోయినా ఇందిర ఇష్టపడిందని తెలిశాక సరేనంటారు. మోహనుడు అమెరికా వెళ్లివచ్చాక వివాహం జరగాలని నిశ్చయమవుతుంది. మోహనుడు ఏడెన్ నుంచి ఇందిరకు ఉత్తరం రాస్తాడు. ఇందిర సమాధానం రాస్తుంది. లలితమ్మగారు మనోవ్యాధితో మంచం ఎక్కుతారు.

(గత సంచిక తరువాయి)

ఏ ఆకారపు పాత్రకు దానిలాగానే పొందుకుని, ఆ ఆకారమే తాల్చే నీటిలాగా, నానారకాల భావోద్వేగాలకు అనుగుణంగా లలితమ్మగారి మనస్సు నబ్బురులా సాగి, నిల్చి ఎగిరిపడుతూ ఉండేది.

కాని రావుగారి మనస్సు ఎత్తుపల్లాలులేని మైదానంలా ఉండేది కూతురిమీద గల ఆయన ప్రేమ ఎప్పుడూ ఎక్కువతక్కువలు లేకుండా శాంతంగా, నిరవంగా, గంభీరంగా, అతిసుందరంగా ప్రవహిస్తూండేది

ఇందిర ఏం చేసినా ఆయనకు కోపంరాదు ఇందిర ఏమడిగినా కాదనడు ఇందిరమీద పూర్ణ వాత్సల్యంగల ఆయన, చివరికి కూతురు కాఫీ తోటలోని ఒక త్రాగుబోతు కూలిని పెళ్లిచేసుకుంటానన్నా ఒప్పుకునేవాడు.

కాని కూతురి మంచిచెడ్డలను గమనించనంత గుడ్డిదై పోలేదు తల్లిప్రేమ ఆమె ఇందిర మంచిచెడ్డలను కళ్లూ, మనస్సూ తెరచిచూసి తప్పు కనిపిస్తే మందలించేది, వారించేది

ఇందిర రెండేళ్ల పాపగా ఉన్నప్పుడు ఒకసారి రావుగారు మైసూరునుండి వస్తూ, నంజనగూడు నుండి చక్కెరకేళి పళ్లు పట్టుకొచ్చారు

ఆయన కనపడగానే చిన్నారి ఇందిర ఎగురుతూ వచ్చి,

"నాన్నా, నాకు పండు" అంది రావుగారు రెండు డజన్ల పళ్లు తీసి ఇందిరముందు పెట్టారు

ఇందిర పండు ఒలచి తినటం ప్రారంభించింది ఒకటి ... రెండు మూడు

ఇందిర నాలుగోపండుమీదికి చేయి వేయగానే అక్కడకు వచ్చిన లలితమ్మగారు గబుక్కున పండు లాగేశారు. ఇందిర ఏడవటానికి మొదలుపెట్టింది లలితమ్మగారు రావుగారిమీద విరుచుకుపడ్డారు.

"తెలివి పిల్ల అన్ని పళ్లు తింటూంటే చూస్తూ ఊరుకున్నారేమండి ?"

"పాపం ఆకలి తింటోంది"

"భలేవారండి ! బిడ్డకు అరటిపండంటే ఇష్టం. నిజమే చక్కెరకేళి అయినా రోజు కొకటి చాలు. పిల్లమీద ప్రేమ ఉందని ఎన్ని పళ్లయినా తినమంటారా ? రేపు జబ్బుచేస్తేనో ?"

"నీమాట నిజం నా బుద్ధి అంత యోచన చేయలేదు" అని ఒప్పుకున్నారు రావుగారు.

రావుగారి ప్రేమ, భవిష్యత్తునుగురించి ఆలోచించేదే కాదు లలితమ్మగారి అదుపు, ఆజ్ఞ లేకపోతే ఇందిర ఉత్త మొండిగా తయారయ్యేదేమో !

కారు చెట్టుచేమలను, కాఫీతోటలనూ వెనుకకు నెడుతూ ఎఱ్ఱదుమ్మును లేపుతూ సాగిపోతూంది.

లలితమ్మగారు సీటుకు ఆనుకుని, కళ్లు మూసుకుని కూర్చున్నారు

రావుగారు నీరసించిన ఆమె ముఖాన్నే చూస్తున్నారు ఆయన మనస్సులో పాతజ్ఞాపకాలు తెరలుతెరలుగా దొర్లిపోతున్నాయి

తాము ఆమెను పెళ్లిచేసుకోటం—పిచ్చిపిచ్చిగా నడిపిన పత్రవ్యవహారం—ఆమె తమ

—38 వ పేజీ చూడండి





## తత్వబోధ

లోకులనమ్మకు ఓదేవ!
లోకులె కాకులు ఓజీవ!
మనసు నమ్మకోయ్ ఓదేవ!
మాట నిల్పకోయ్ ఓజీవ!
వాటికి వీటికి ఆశించి,
మానమునంతయూ వెలి వేసి,
ఉక్కిరి బిక్కిరి ఐపోయే
చిక్కులు పెట్టే వారదులే!
ఉపాయమ్ము బదులుగా,
అపాయమ్ము కలపెట్టి
ఇంటిలోన నివసించి,
ఇంటివాసాలు లెక్కించి, లోకుల
ముఖప్రీతి మాటలచే,
ముచ్చైన మనసుతో,
మంచిమనసు మార్పించే
మహిమగల మాంత్రికులే,
'మీ యింటికొస్తే ఏమిస్తావ్?
మా యింటికొస్తే ఏంతెస్తావ్?'
అనుచును బిచ్చము పిల్లికైనా
పెట్టని ధర్మదాతలెగా!
నలుపును కల్గిన గురిగింజ,
ఎఱుపని తల్చిన రీతిగనే,
తామెన్నో తప్పులు చేయుచునే,
ఇతరుల తప్పులు వెతికెదరు, లోకుల...||

* * *

## మాటనిలకడ

"అమ్మా! నాకో బిస్కట్ ఇవ్వవూ?" పాప గోముగా అడిగింది.

"ఇంకా కావాలా? ఇందాకేగా మూడు బిస్కట్లు పట్టుకెళ్లావ్."

"ఇంకొక్కటంటే ఒక్కటి చాలు."

"సరే తీసుకో! ఇవ్వాల్టికి మళ్లీ ఇవ్వను తెలిసిందా."

"మా అమ్మ మంచిది! నీకు బొత్తిగా మాట నిలకడ లేదమ్మా!"

జి. రాఘవయ్య (తెనాలి)

* * *

## పెద్దరికం

"నువ్వు వచ్చి డబ్బు తీసికెళ్ల లేదేమయ్యా?" కృష్ణమూర్తి గారు గుడ్డలు కుట్టే అతన్ని అడిగారు.

"పెద్దమనుష్యుల్ని డబ్బు అడగనండీ."

"బావుంది! వాళ్ళు ఇవ్వకపోతేనో?"

"అప్పుడు వాళ్ళు పెద్దమనుష్యులు కాదనుకుని వెంటపడి వసూలు చేస్తాను."

సి. కోమలాదేవి (రాజమండ్రి)

* * *

రైలుపెట్టెలో జనం కిటకిటలాడుతున్నారు. మురికిగుడ్డలతో ఉన్న ఓ పదేళ్ళ కుర్రాడు మెల్లగా చోటుచేసుకుని, ఒక పెద్దమనిషి పక్కన చేరాడు. కూర్చున్నదగ్గరనుంచీ వాడు అదేపనిగా తుమ్ముతున్నాడు.

"నీ దగ్గర చేతిగుడ్డ లేదూ?" పెద్దమనిషి చికాకుపడ్డాడు.

"ఉన్నది గాని, కొత్తవాళ్ళకెవరికీ ఇవ్వను" కుర్రాడు నిర్మొహమాటంగా చెప్పాడు.

కోటేశ్వరరావు (కాకినాడ)





'నాకు చిన్నప్పటినించీ స్కూలు మాస్టరవ్వాలనే కోరిక ఉండేది. ఇప్పటికి అది జరిగింది. అలాగే నువ్వు చిన్నప్పటినించి అనుకున్న దేమైనా జరిగాయా?'

'నా చిన్నప్పుడు మా అమ్మ నన్ను జుట్టుపట్టుకుని కొడ్తూంటే ఈ జుట్టంతా ఎప్పుడు ఊడిపోతుందిరా దేవుడా అనుకునేవాడిని. చిన్నప్పటినించి నేను అనుకున్నవాటిలో జరిగింది ఇదొక్కటే.'

# ప్రేమ కానుక

బొమ్మలకథ





















ఆంధ్రసచిత్ర వారపత్రిక

# వారఫలాలు

దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**6-7-1962 శుక్రవారము మొదలు**
**12-7-1962 గురువారము వరకు**

## మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

**ఈవారం విశ్రాంతి** కనుపించదు. ధైర్యంగా **ఇతరులను** నమ్మి కార్యభారం వదలటానికి **వీలు** కనిపించదు లాభం విశేషంగా ఎదురుచూచి ఆరం**భించిన** పనులు మధ్యభాగంలో సందేహపడవలసిన **స్థితికి** వస్తవి అయితే పట్టుదలతో నెరవేర్చగలుగు**తారు** బంధువులవల్ల మనశ్శాంతి లోపించగల **అవకాశాలున్నవి** వృత్తికి సంబంధించిన వార్తలు **ఆలస్యంగా** అందినా అనుకూలమార్గంలో ఉంటవి **ఈ** సమయంలో శరీరశ్రమకన్నా, మానసికశ్రమ **మాత్రం** అధికంగా ఉంటుంది సాధ్యమైనంత **వరకు** చేతిలోని డబ్బును ముందుగా ఖర్చు చేయ**వద్దు** ప్రత్యేకమైన అవసరాలు కలుగవచ్చు విద్యా**రంగంలో** మనస్సు కుదురుబాటుగా ఉండదు 8, 9 **తేదులలో** అనారోగ్యం, బంధువులతో పేచీలు.

* * *

## వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

పనికొంచెం ప్రయత్నము, అట్టహాసము అధికం వృత్తి, **ఉద్యోగాలలో** మిమ్ములను మార్గమును తప్పించే సలహాలు చెప్పేవారుంటారు. "దూరపు కొండలు నునుపు" అనే సామెతనుమాత్రం గుర్తు

> **గ్రహస్థితి**
>
> వృషభంలో అంగారకుడు, వృషభ, మిథునాలలో బుధుడు, మిథునంలో సూర్యుడు, కర్కాటకంలో రాహువు, కటక, సింహాలలో శుక్రుడు, మకరంలో శని, కేతువులు, కుంభంలో గురువు, సింహ, కన్య, తులలలో చంద్రుడు

ంచుకొనండి ఉష్ణదోషంవల్ల బాధపడతారు మిత్రులతో ప్రసంగించే సందర్భాలలో ఓర్పును, నేర్పును ప్రదర్శించగలుగుతారు గౌరవంతోపాటు ధనాదాయం కూడా పెరుగుతుంది మీ డబ్బును అధికారాన్ని తమ స్వాధీనంలో పెట్టుకొనటానికి ప్రయత్నించేవా**రుంటారు. జాగ్రత్తగా ఉండండి. మీరు విత్య కృత్యంలో చేయుపనులలో** తరచు ముఖ్యమైన ఘట్టాలలో మరచిపోవటం జరుగుతూఉంటుంది దైవ కార్యాలలో పాల్గొనే అవకాశం లభిస్తుంది 11, 12 తేదులలో శత్రుబాధ, ఇతరుల ధనసహాయం చేయవలసిన అవసరం

* * *

## మిథునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ధనవ్యయం ఎక్కువగా ఉన్నా, ముఖ్యంగా కార్యరంగంలో పోటీ వదలిపోతుంది. బంధుమిత్రుల నద్దనుంచి సంతోషవార్తలు వస్తవి. వ్యాపారవ్యవహారాలలో **ప్రశాంత లక్షణం కార్యానుకూలత ఉంటవి అధికారుల మంచితనాన్ని చక్కగా వినియోగించు**కొని **క్రమంగా ముందుకుపోగలుగుతారు. పిల్లల** ఆరోగ్యవిషయంలో **జాగ్రత్త అవసరం** లాటరీ పట్టా వ్యాపారం వంటి పనులకు దిగవద్దు మిమ్ములను స్తోత్రంచేసేవారు అధికం అవుతారు ఈవారం రెండవభాగంలో ప్రసంగాలు ముదిరి విరోధాలకు **దారితీయకుండా** చూచుకొనండి. ఆదాయం మామూ**లుగా ఉంటుంది** ప్రయాణాలు చేయవలసి రావచ్చు **ఏవిషయంలోనైనా** పదిమందినీ మెప్పించగలుగ**తారు.** 9, 10 తేదులలో ధనలాభం, బంధువుల **ఆదరణ**

* * *

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)**

మనస్సు పరిపరివిధాల పోతూఉంటుంది ఆదుర్దా పనులలో ప్రతిబంధకాలు కనిపిస్తవి బంధువులను గురించిన సమస్యలు మీ మనస్సును చికాకు పరచగల సమయం. వృత్తిలో మీ విలువ పెరుగుతున్నట్లు పైకి కనుపిస్తుంది అయితే దానితో బాటు ఫలితంలేని బాధ్యతలు పైనపడుతవి. ఈ సమయంలో ఆడంబరం తగ్గించుకొని సంఘ కార్యాలకు దూరంగా నిలబడటం అవసరం అవుతుంది తలవని తలంపుగా లాభవార్తలు తెలుస్తవి పెద్ద పెద్ద వ్యాపారములవంటి పనులలో డబ్బును వినియోగించటంవంటి యోచనలు చురుకుగా జరుగుతవి శుభపుణ్యకార్యాలకు అభ్యంతరాలు కనుపించినా చివరకు నెరవేర్చగలుగుతారు 6, 7 తేదులలో ఆదాయవృద్ధి, చిక్కులతో కార్యసిద్ధి

* * *

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ముందుగా ఏ కార్యంలోనూ జోక్యం కలిగించుకొనలేకపోతారు అయితే సమయానికి భారం వహించి గౌరవం పొందగలుగుతారు ముందు ధన విషయంలో సర్దుబాట్లు చేయలేకపోతామనేభావం

తోస్తుంది కాని, మీ జాగ్రత్త కార్యరంగంలో జరిగే మార్పులు అనుకూలించటంవల్ల చిక్కు చల్లగా తొలగిపోతుంది. వృత్తిలో శ్రమను తగ్గించుకునే ప్రయత్నాలు క్రమంగా అనుకూలిస్తవి గత కాలంలో చాలాసారులు ప్రయత్నించినాకాని, ముఖ్య వ్యవహారాలు ఈ సమయంలో ప్రశాంతంగా పూర్తి అవుతవి. వినోదకార్యక్రమాలలో పాల్గొంటారు నిష్ఠవార్తలు రావటంవల్ల వారాంతంలో మానసికంగా ఉద్రేకం కలుగుతుంది ముఖ్యంగా శక్తి సామర్థ్యాలకుమించిన ఆడంబరాన్ని ప్రదర్శించవలసిన సమయం. 9, 10 తేదులలో శుభవ్యయం, గౌరవ లాభం, వృత్తిలో అధికశ్రమ

* * *

## కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

పనిచేస్తూఉంటే పెరుగుతూఉంటుంది. న్యాయపద్ధతిలేని మనుష్యులతో వాదనలు పెరిగే అవకాశాలున్నవి అధికారుల సహాయం లభిస్తుంది. క్రొత్తగా ఆరంభించదలచుకొన్న పనులలో ఒకదానికొకటి అభ్యంతరం కాకుండా చూచుకొనటం అవసరం విలువగల వస్తువులు కొంటారు ఎదటివారు తప్పులు చేస్తున్నట్లు తెలిసికూడా చల్లగా పని జరుపుకొనవలసిన సమయం కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా యుండదు ఎంత డబ్బు వచ్చినా మంచినీళ్ళవలె ఖర్చు అవుతుంది అధికారుల స్నేహం లభిస్తుంది. వృత్తిలో తోటివారివల్ల మోసం జరుగుతున్నట్లు భావించవలసి వస్తుంది దైవానుగ్రహంవల్ల ప్రత్యక్షమైన చిక్కు ఏమీ ఉండదు 7, 8 తేదులలో అనవసరమైన శ్రమ, ధనవ్యయం, కార్యసిద్ధి.

* * *

## తుల:

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

సాధ్యమైనంతవరకు సాహసకార్యాలలో ప్రవేశించవద్దు వృత్తి ఉద్యోగాలలో అదృష్టదాయకమైన కాలం సుఖంమాత్రం తక్కువ కుటుంబంలో మీరు భారం వహించకుండా పనులు జరుపుకొనగలుగుతారు గ్రంథపఠనం, సాహిత్యరంగంలో కృషి మొదలయినవాటికి అనుకూలమైన సమయం వృత్తిలో ఎదటివారి మోసాన్ని ముందుగా తెలుసుకొని జాగ్రత్తపడగలుగుతారు ఇతరుల వ్యవహారాలలో కొంతవరకు జోక్యంపెట్టుకొని ఒకవిధంగా సమస్యలను పరిష్కరించవలసివస్తుంది ఇంతకుముందు విస్తారంగా మాట్లాడేవారు ప్రస్తుతం మీ మాటను అనుసరిస్తారు మొదట్లో మీరు కొంత బద్ధకించినా, సమయానికి కార్యరంగంలో చురుకుగా ప్రవేశించగలుగుతారు 10, 11 తేదులలో అకస్మాత్తుగా శరీరబాధలు, కలహాలు.

* * *

## వృశ్చికం:

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

దైవబలంవల్ల ముందుపడిన ఆదుర్దా తొలగిపోతుంది వృత్తివ్యాపారాలలో ముఖ్యప్రయోజనాన్ని సాధించగలుగుతారు ఉత్తరదిక్కునుంచి అనుకూలవార్తలు తెలుస్తవి జాగ్రత్తగా ఉన్నామని అనుకొంటూ ఏది అనవసరమో ఆ పనినే పట్టుదలగా చేయటం జరుగుతుంది ప్రత్యక్షంగా కలహాలు రాకపోయినా వాతావరణంమాత్రం మిమ్ములను ఆందోళనపెట్టవచ్చు శుభకార్యాలు అనుకూలిస్తవి. మీ ఆరోగ్యం బాగుంటుంది ధనాదాయం సంతృప్తికరంగా ఉంటుంది ఈ సమయంలో మీ మాటను కొంతమంది నమ్మకపోవటంవల్ల కార్యసాధన నిమిత్తం ఇతర మార్గాలను అనుసరించవలసివస్తుంది ప్రయాణాలు చేయవలసిన అవసరం కలుగవచ్చు 7, 8, 9 తేదులలో సంఘంలో గౌరవం, అనుకూలవార్తలు, కారణంలేని ఆందోళన

* * *

## ధనుస్సు:

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఎవ్వరినీ అతిగా నమ్మవద్దు. ధనం విశేషంగా వస్తుంది ఖర్చు అవుతుంది గౌరవము, అధికారుల ఆదరణ లభిస్తవి నరముల బలహీనత, పనులయందు పాలుమాలిక కనుపిస్తవి ముందు జాగ్రత్త అవసరం. మీరు ఆశ పెట్టుకొన్న మార్గాలలో ఫలితం లేకపోవచ్చు. కాని మరొకవిధంగా మీ సమస్యలు చక్కగా పరిష్కారం అవుతవి మీ కోరికకు తగినట్లుగా ఆహార విహార సౌఖ్యాలు అమరకపోవచ్చు బంధుమిత్రులసహా మిమ్ములను శ్రమ పెట్టగల సమయం స్థిరాస్తులు అమ్మటం కొనటంవంటి వ్యవహారాలు ప్రశాంతంగా జరుగుతవి యంత్రాలు, అగ్ని మొదలయినవాటికి సంబంధించిన పనులలో జాగ్రత్తగా ఉండండి వారం రెండవభాగంలో లాభవార్తలు తెలుస్తవి అప్పులభారం పెంచుకొనవద్దు 8, 9 తేదులలో వివాదాలు, వృత్తిలో గౌరవం

* * *

## మకరం:

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

మనస్సులో సంచలనం అధికమవుతుంది డబ్బు లభిస్తేగాని పనులు పూర్తికావు పనులు పూర్తి అయితేగాని డబ్బు చేతికిరాదు. బాహ్యగౌరవంకోసం శ్రమను సహించుకొనవలసివస్తుంది. పెట్టుబడి నిమిత్తం స్నేహితుల సహాయం ఎదురుచూడవలసి వస్తుంది గృహకృత్యాలలో పరస్పరసహాయం తగ్గుతుంది ఖర్చుచేసికూడా సుఖ, సంతోషాలు పొందలేకపోతారు చేతికి దొరికిన అవకాశాన్ని వినియోగించుకొనటంకోసం చాలా శ్రమపడవలసివస్తుంది అవసరంలేని సమయంలో అందరు ఆదరించి సహాయం చేస్తారు ప్రయాణాలు చేయవలసినట్లు కనిపించినా, ఆటంకాలు వస్తవి ఇతరుల చేతినుంచి రావలసిన వస్తువులుకాని, డబ్బుకాని వారాంతంలో వస్తవి. వ్యవహారరంగంలో కొద్దిలాభంతో పనులు పూర్తి అవుతవి. 6, 7 తేదులలో సంచారం, కష్టవార్తలు, ధర్మకార్యాలు.

---

**—— ఈ వారము ధరలు ——**

బంగారుధర క్రమక్రమంగా తేజీతో ఉంటుంది. వారాంతంలో మందీ రాగల అవకాశాలున్నవి. వెండిధర వారం రెండవ భాగంలో పెరుగుతుంది పసుపుధర వారం ప్రారంభంలో మందీ నూవులనూనె ధర గతవారంకన్నా మందీలో ఉంటుంది. వేరుశనగపప్పు నూనెల ధరలు కొద్ది మందీలో నిలుస్తవి శనగలకు గిరాకి వస్తుంది నూలు ధరలో ముందు మందీ వస్తుంది వారాంతంలో హెచ్చు తగ్గులు కనిపిస్తవి మిర్చికి గిరాకి వస్తుంది

---

* * *

## కుంభం:

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఓర్పుతో మీ గౌరవమునకు భంగంరాకుండా చూచుకోగలుగుతారు ఈ సమయంలో ఎదటివారి మాటలకు ప్రాధాన్యం ఈయటం మంచిదికాదు అధికారులవల్ల అనుకూలత ఉంటుంది. ఆదాయంలో కొంత తగ్గుదల కనుపించినా చిక్కుపరిస్థితులు ఏమీ ఉండవు వృత్తిలో మీ స్థితి బాగుంటుంది. పదిమందికీ అనుకూలమైన పనులను సాధించగలుగుతారు క్రొత్తగా ఆరంభించే వ్యవహార, వ్యాపారాలలో దైవికంగా అభ్యంతరాలు ఏర్పడగల సమయం మీతో లావాదేవీలు జరిపేవారు కొందరు మాట తప్పటంవల్ల కలహాలు వస్తవి శుభకార్యప్రయత్నాలు అనుకూలిస్తవి కాని, వెంటనే పూర్తికాకపోవచ్చు ఆదుర్దా చెందవద్దు—10, 11 తేదులలో సంఘకార్యాలు, ప్రయాణసూచన.

* * *

## మీనం:

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

ఉత్సాహవంతమైన సమయం వ్యవహారకార్యాలు, అధికారులను కలుసుకొనటం, ఆస్తులు మొదలయినవి కొనటం ఈ పనులలో అనుకూలత ఉంటుంది సంకల్పించిన పనులు చురుకుగా జరుగుతవి మీక్రింద పనిచేయువారిమూలంగా అన్ని విధాలా ఉపయోగం కనిపిస్తుంది కుటుంబంలో శుభ సంతోషకార్యాలు జరుగుతవి విలువగలవస్తువులు కొనటంవంటి పనులలో ఇతరులవల్ల మోసం జరుగకుండా చూచుకొనండి ఎటువంటి కఠినమైన పనులనుకూడా సాహసంతో నెరవేర్చగలుగుతారు. లోగడ ఇతరులకు చెప్పిన మాటను కాపాడుకొనటం నిమిత్తం అనవసరమైన శ్రమ, ఖర్చులు భరించవలసివస్తుంది. 8, 9 తేదులలో వినోద కార్యక్రమాలు, ధనలాభం.



**తెలుగు పత్రికలన్నింటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!**

# ఎఫ్. బి. ఐ. కథలు-3

## మిత్రులలో హత్య

**నార్మన్ అబట్**

'ట్విన్‌ఫాల్‌స్' ఇడాహొ రాష్ట్రంలో ఒక చిన్న ఊరు—ఈ కథ జరిగినప్పటికి సుమారు 12,000 జనాభా, ఇప్పుడు 20,000 దాటింది. ఇటువంటి చిన్ననగరంలో పోలీసుశాఖ అధిపతికి ఊళ్లో చాలామంది తెలిసి ఉంటారు. వారిలో ఎందరో స్నేహితులుకూడా ఉంటారు.

పోలీసుశాఖ అధిపతి హవార్డ్ జిల్లెట్‌కి జార్జి ఎల్. ఓల్సన్‌తో నిజంగా పరిచయంలేదు—ఇతను సాల్ట్‌లేక్‌సిటీనుంచి వచ్చాడు—కాని అతన్ని గురించి కొన్ని వివరాలు తెలుసు. ఉటారాష్ట్రం రాజధానిలో ఉన్న ఒక నగలదుకాణం సేల్‌స్‌మాన్‌గా ఓల్సన్ ట్విన్‌ఫాల్స్‌కి ప్రతినెలా వచ్చిపోతూ ఉండేవాడు అక్కడ రెండు నగల అంగళ్ళు మంచి ఖాతాదార్లుగా ఉండేవారు.

ఒక మంగళవారం సాయంత్రం ఓల్సన్ కారు పార్క్ హొటల్ వెనుక ఆగిఉంది. కారులో ఓల్సన్ శరీరం నిర్జీవంగా పడిఉంది: అంతకు మూడు రోజుల క్రితమే తలలోనుంచి కాల్చి చంపివేశారని తర్వాత తెలిసింది.

జిలెట్ వెంటనే పరిశోధన ప్రారంభించాడు. ఆ ప్రాంతాలలో ఇద్దరు దొంగలు తిరుగుతున్నట్లు తెలిసి వారికోసం వెతకటం మొదలుపెట్టారు.

ఓల్సన్ చనిపోయినరోజున వీ రిద్దరూ సాల్ట్ లేక్‌సిటీలో ఒక షాపు దోచి—తుపాకులు సైతం ఉపయోగించారు—ట్విన్‌ఫాల్‌స్‌వైపు ప్రయాణం చేస్తున్నట్లు అక్కడి పోలీసు అధికారులు చెప్పారు.

వీరు తప్ప ఓల్సన్‌ని ఇంకెవరు చంపి ఉంటారు? ట్విన్‌ఫాల్‌స్‌లో ఎవరూ అయిఉండరు. అందులోనూ ఓల్సన్‌తో శనివారంనాడు మాట్లాడినవారిద్దరు వ్యక్తులకూ ఈ హత్యతో సంబంధం ఉండదు! ఈ ఇద్దరూ ఎవరు? ట్విన్‌ఫాల్‌స్‌లో నగలవ్యాపారం చేస్తున్న ఓల్సన్ ఖాతాదార్లు. పోటీలోఉన్నా ఒకరితో ఒకరు స్నేహంగానే ఉండేవారు. అంతేకాదు, పోలీస్ అధిపతి హవార్డ్ జిల్లెట్ ఆప్తమిత్రులలో ఇద్దరు.

అయినా, అనుమానితులయిన ఇద్దరు దోపిడీ దొంగలూ కాలిఫోర్నియాలో దొరికిపోవటంతో ఓల్సన్‌హత్యకి వారికి ఏమీ సంబంధం ఉండటానికి వీలులేదని తేలిపోయింది; శనివారంనాడు వారు ట్విన్‌ఫాల్స్‌లోలేరు. జిల్లెట్‌కి తన స్నేహితులలో ఒకరే నేరస్థుడయి ఉండవచ్చునసే అనుమానం కలిగింది. ఈ అనుమానం ఆయనకు కొంత బాధ కూడా కలిగించకపోలేదు.

(ఆ)తను మరణించినదినం—అంటే శనివారం, మే 28, 1938 ఓ మధ్యాహ్నంపూట ఓల్సన్ తన ఖాతాదార్ల నిద్దరినీ చూశాడు. వారిపేర్లు—జిక్‌జాన్ జాన్‌స్టన్, 45 సంవత్సరాల వయస్సు; వాల్టర్ గ్లెన్, వయస్సు 35 సంవత్సరాలు. ఓల్సన్ జాన్‌స్టన్ అంగడికి వెళ్లాడు. వచ్చినపని పూర్తి చేసుకుని గ్లెన్ కొట్టుకి వెళ్లాడు. కాని, మరొకసారి జాన్‌స్టన్‌ని చూడటానికి వస్తానని చెప్పి మరీ వెళ్లాడు.

గ్లెన్‌ని ప్రశ్నించగా, తను ఓల్సన్ వచ్చినప్పుడు పనిలో మునిగిఉండటంచేత అతను (ఓల్సన్) తర్వాత



వస్తానని వెళ్ళిపోయినట్లు చెప్పాడు. ఇలా వెళ్ళిన పిదప తిరిగి ఎవరిఅంగడికీ రాలేదని జాన్‌స్టన్, గ్లెన్‌లు ఇద్దరూ తేల్చారు.

### కార్యక్రమంలో మార్పు

సాధారణంగా ఓల్సన్ తన వెలివసంచిని జాన్‌స్టన్ ఇనప్పెట్టెలో దాచేవాడు. అదివారంకూడా ఊరిలోనే ఉండదలచుకుంటే ఇలా తప్పకుండా చేసేవాడు. ఈ సారి సంచి తనతోనే తీసుకుపోయాడు. తర్వాత వస్తాడేమో అనుకున్నాడు. ఓల్సన్ తనకోసం వచ్చినప్పుడు చేతిలో సంచి చూశానని గ్లెన్ చెప్పాడు.

సాల్ట్‌లేక్‌సిటీలో ఓల్సన్ పై అధికారులను అడగగా వారు ఆ సంచిలో 15,000 డాలర్ల విలువకల వజ్రపుటుంగరాలు ఉన్నట్లు తెలియచేశారు ఇవికాక, కొన్ని చవకైన నగలు, రెండు ఖరీదైన చేతి గడియారాలు గ్లెన్‌కి చూపటానికని ఓల్సన్ సంచిలోవేసి తీసుకువెడుతున్నట్లు తనకు చెప్పినట్లు వారు తెలిపారు. (గ్లెన్ ఇటువంటి గడియారాలు చూడాలని చెప్పాడుట.)

—37 వ పేజీ చూడండి



ఏపుగా పెరిగి శాఖోపశాఖలుగా విస్తరిల్లిన వేపచెట్లక్రింది వెలుగుచీకట్ల రంగవల్లికలను రచిస్తోంది వెన్నెల. పటణానికి కాస్త దూరంగా ఉన్న రైల్వేస్టేషను ఆవరణలో, నిండిన చెరువు పైనుంచి వీస్తున్న చల్లటి గాలితో ప్రాణాలకు హాయిగా ఉంది. ఏకాంతాన్ని అన్వేషిస్తూ ప్లాట్‌ఫారం చివరిదాకా వెళ్లి ఎక్కడా బెంచీ ఖాళీగా కనిపించకపోవడంతో మళ్లీ వెయిటింగుహాలు వైపు తిరిగొస్తున్నాను. చుట్టూరా చెలరేగుతున్న సందడిని పట్టించుకోకుండా బుద్ధిని అంతర్ముఖంగా మళ్ళించి ఏదైనా గొప్పవిషయాన్ని గురించి ఆలోచించాలని ప్రయత్నిస్తున్నమాట నిజమే! కానీ బాహ్యప్రపంచం మానవుణ్ణి అంత సులభంగా వదిలిపెట్టేది కాదు. అదీగాక వాగ్యుద్ధాలు, పెడనవ్వులు, చంటిబిడ్డల ఏడ్పులు, పరిహాస ప్రసంగాలు నిర్విరామంగా వినవచ్చే స్టేషను ప్లాట్‌ఫారం ఆలోచించుకోడానికి అనువైన చోటు కూడా కాదు. పురెక్కని దారానికిమల్లే ఎక్కడిఊహ అక్కడే తునాతునకలైపోతుండగా, తెగిన తునకలను మళ్లీ ముడివేయడానికి ప్రయత్నిస్తూ మెల్లిగా ముందుకు నడుస్తున్నాను.

ఆలోచనతోబాటు నా నడక కూడా ఒకచోట హఠాత్తుగా ఆగిపోయింది. జడత్వం సిద్ధించినట్టు విగ్రహంలా నిల్చుండిపోయి, అనిమిషత్వం సిద్ధించినట్టు రెప్పలల్లార్చకుండా వేపచెట్టునీడలో బెంచీపైన కూర్చున్న అమ్మాయికేసి చూస్తుండిపోయాను. అదృష్టంకొద్దీ ఆమె నన్ను చూడటం లేదు. ఎందుకంటే నా కామె కనిపించినట్టు నేనామెకు కనిపించివుండినట్టయితే ఆమెది నామాదిరిగా ఊరుకునే స్వభావం కాదని నాకు బాగా తెలుసు. 'నమస్కారమండీ మేష్టరుగారూ' అంటూ లేచి నిల్చుని పలకరించి ఉండేది. ఆ పరిస్థితిలో నేను తప్పనిసరిగా ఆమెతో మాట్లాడవలసి వచ్చేది. ఆ సంఘటన నలుగురికళ్లకూ విడ్డూరంగా కనిపించి అనుమానదృక్కులు వాడిములుకుల్లా దాడిసలిపితే నిభాయించుకోడం నాచేత నయ్యేపని కాదు.

అసలు—స్వభావాన్ని బట్టి లోకుల్ని రెండంటే రెండు రకాలుగా విభజించవచ్చు. మొదట తమని గురించి, ఆతరువాత ప్రపంచాన్నిగురించి ఆలోచించేవాళ్లు ఒకరకం. మొదట ప్రపంచాన్ని గురించి ఆతరువాత తమనిగురించి ఆలోచించేవాళ్లు రెండోరకం. మా మామగారింటి రెండో వాటాలో అద్దెకున్న భద్రయ్యగారి కుమార్తె శ్యామల మొదటి రకానికి చెందిన వ్యక్తి. ఎవరో అనుమానంగా చూస్తారనీ, మరెవరో గుసగుసలాడుకుంటారనీ తన కోరికకు కళ్ళెం వేసుకోడం ఆమె స్వభావానికి విరుద్ధం!

ఆమాటకొస్తే, ఎవరో మహాత్ముల్ని కొందరిని మినహాయిస్తే, ఈ ప్రపంచంలో స్వప్రయోజనాన్ని కాంక్షించనివా రెవరున్నారు? ఎటొచ్చీ కొందరు తమస్వార్థాన్ని చాకచక్యంగా కప్పిపుచ్చుకుని పైకెంతో త్యాగమూర్తులుగా కనిపించడానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నంలో కృతకృత్యులౌతారు గూడా! శ్యామలలో అలాంటి కృత్రిమ ప్రవర్తన మచ్చుకైనా కన్పించదు. ఆమె జంకుగొంకులు లేకుండా చెప్పదలచుకున్న మాట చెప్పేస్తుంది. చేయదలచుకున్న పని చేసేస్తుంది. అందుచేతనేగావచ్చు, లోకుల దృష్టిలో శ్యామల మూర్తీభవించిన స్వార్థంగా లెక్క కెక్కిపోయింది.

ఎవరిదాకానో ఎందుకు! నాలుగేళ్లపాటు శ్యామలతో కలిసి చదువుకున్న మా రాజేశ్వరికి ఆమెపట్ల సదభిప్రాయం లేకపోయింది.

అభిప్రాయ భేదాల సంగతి ఎలావున్నా స్నేహితురాళ్ళిద్దరూ చదివినంతకాలం చదివి పరీక్షలో ఫెయిలుకావడంతోమాత్రం ఏకీభవించారు. పోయినపరీక్ష పోయిందే ననుకుని రాజేశ్వరి సంసారంలోకి తరలి వచ్చేసింది. శ్యామలమాత్రం మార్చికనీ, అక్టోబరుకనీ మాటిమాటికీ పరీక్షలకు తలపడుతుండేది. సాధనవల్ల సమకూరని పను లేమున్నాయి గనుక! ఆఖరుకు ఆ పరీక్షలు శ్యామలకు లొంగివచ్చేశాయి. ఓ శుభముహూర్తాన ఆమెనెంబరు పరీక్షాఫలితాల్లో కనిపించింది.

"చూచావా రాజేశ్వరీ! అలా ఉండాలి పట్టుదల. జీవితం మావటీనిమాట వినని మదపుటేనుగ లాంటిది. అంకుశంతో కుమ్మి ఏనుగను లోబరుచుకున్నట్టుగా జీవితాన్నిగూడా ఎప్పటికప్పుడే చక్కదిద్దుకోవాలి. పరీక్షలో ఫెయిలుకావడమంటే అది జీవితంలో ఎదురైన మరొక పెద్ద పరీక్షన్నమాట! ఈ పరీక్షలోని గెలుపోటములపైన జీవితంయొక్క బాగోగులు ఆధారపడి ఉంటాయన్నమాట! శ్యామలకు లేని చిక్కులూ




లేవు నీకు ఉన్న యిబ్బందులూ లేవు. అయినా ఆమె పరీక్ష పాసు కాగలిగింది !'' అన్నాను.

"అబ్బో, ఘనకార్యమే చేసిందిలెండి ! కళ్ళకు వత్తులు వేసుకుని రేయింబవళ్ళూ చదివితే ఎవరు మాత్రం ప్యాసుకారు ?'' అంది రాజేశ్వరి.

"నాకు తెలియక అడుగుతాను రాజేశ్వరీ ! నువ్వుమాత్రం అలా ఎందుకు చదవగూడదు ?'' అని నిలదీసి అడిగాను.

"చదివి చేసేదేముందిలెద్దురూ ? ఆడదేం ఉద్యోగాలు చేయాలా, ఊళ్ళేలాలా .... '' అంటూ తప్పుగా తేల్చేసింది రాజేశ్వరి.

నేను నవ్వాను-- "మంచిమాటన్నావు రాజేశ్వరీ! అది మీ అమ్మమ్మ తరచుగా చెప్పేమాట ! దురహంకారపూరితుడైన మగవాడెవడైనా చెప్పవలసినమాట ! ఎలాగూ నువ్వు ఉద్యోగం చేయడానికి వీల్లేకపోయిందిగనుక, అందనిపళ్ళు నీకు పుల్లగా కనుపిస్తున్నాయన్నమాట !'' అన్నాను

రాజేశ్వరిముఖం మంచుదెబ్బతిన్న తమ్మిపువ్వులా చిన్నబోయింది. ఆ ముఖం నాకు చూపించడానికి యిష్టంలేక పెడముఖం చేసుకుని ఆమె రివ్వున లోపలికి వెళ్ళిపోయింది.

అత్తారింట్లో ఓ రోజు రాత్రి తొమ్మిది గంటలప్పుడు ఆరుబయట చాపపైన పడుకుని తాంబూలం నములుతున్నాను. ఇంటిల్లిపాదికీ భోజనాలు వడ్డించి యింటిపనుల్లో ఉక్కిరిబిక్కిరైన శరీరానికి కాస్త స్వేచ్ఛను ప్రసాదించడంకోసం మెల్లగా అరుగుపైకి వచ్చింది శ్యామల.

"పరీక్ష ప్యాసయ్యావు సరే శ్యామలా ! ఇకపైన ఏం చేయదలుచుకున్నావు ?'' అని ప్రశ్నించాను.

మెట్లు దిగివచ్చి నాకు కొంతదూరంలో నేలపైన కూర్చుంది శ్యామల. నా ప్రశ్నకు ఆమె సమాధానం చెప్పిన తీరును బట్టి చూస్తే ఆమె అలాటి ప్రశ్నకోసం ఎంతోకాలంనుంచీ వేచి చూస్తున్నట్టు కనిపించింది.

"ఏంచేయమంటారు మేష్టరుగారూ ! ఈ యింట్లో ఒకరిమాట ఒకరికి లేదు. నాన్నగారి దొక దోవ. అమ్మ దొక దోవ. మీకు తెలుసునో తెలియదో మా నాన్నగారిని సన్నిహితులు నిత్యానందమని పిలుస్తారు. నిజంగా ఆయన కది సార్థక నామధేయం ! పదునువాన పైనబడితే చెదరని మానవు డెవరంటే మా నాన్నగారే ! చేతికొచ్చిన జీతాన్ని ఆయన నా దోసిట్లో పోసేస్తారు. అంతటితో తమ బాధ్యత తీరిపోయినట్టు భావిస్తారు ఆకులో అన్నం వడ్డించి పట్టే చారు పోసినా సరే, మారుమాట లేకుండా భోజనంచేసి వెళ్ళిపోతారు వేళకు స్కూలుకు వెళ్ళడం, పాఠాలు చెప్పడం, తెల్లవారితే రీడింగురూముకు వెళ్ళి న్యూసు పేపరు చదవడం, సాయంత్రమైతే కొండతట్టుగా షికారు వెళ్ళడం—ఇవి తప్పితే ఆయనకు మరొక ధ్యాస లేదు. ఇక మా అమ్మసంగతిగూడా మీరు గమనించి ఉండకపోరు. ఇరుగమ్మలతో, పొరుగమ్మలతో మాట్లాడడానికే ఆమెకు ప్రొద్దు చాలదు. నోటినిండుకూ తాంబూలం దొరికితే వాళ్ళు ఆమెపాలిటి కదే బ్రహ్మానందం. ఈ పిల్లలు ఏం తింటున్నారు, ఏం చదువుతున్నారు, పెద్దవాళ్ళయితే వీళ్ళ గతేంకావాలి అన్న ఆలోచనకూ ఆమెకూ చాలా దూరం ! ఆ నిత్యానందానికీ, ఈ బ్రహ్మానందానికీ మధ్య ఈ సంసార మొక చిన్న నరకం. దీనిసంగతి నా కొక్కతెకు తప్పితే మరెవరికీ పట్టదు. పోనీ దీన్ని బాగుచేద్దామంటేనా బుర్ర చించుకున్నా ఉపాయం స్ఫురించదు. చేతిలోని పని గనుక ఎలాగో ఓలాగు పరీక్షలో కడతేరి ఒడ్డుకు చేరుకోగలిగాను. ఉద్యోగం చూచి పెట్టమండే 'అలాగేనమ్మా' అంటారు. అంతేగానీ నాన్నగారు కనీసం అప్లికేషన్‌ఫారమైనా సంపాదించిపెట్టలేదు ఇదీ నా పరిస్థితి ...''

శ్యామల ప్రసంగాన్ని వింటూ నేను నిర్ఘాంతపోయినమాట వాస్తవం. నేనేదో ఉబుసుపోక కోసం ఆమెను పలకరించాను. తీగెను కదలించానేమో దానితో డొంకంతా కదిలింది ఆ కదలడంలో ఆమె ఎదలో నిక్షిప్తమై ఉన్న ఆవేదనలన్నీ అప్రయత్నంగా బయటికొచ్చేశాయి.

పిలుపొచ్చింది శ్యామల మరికొంతసేపు తనసొదను వెళ్ళబోసుకునేదేమో ! తమ్ముడు నాగరాజు సినిమానుంచి తిరిగి రావడంతో ఆమె వాడికి భోజనం వడ్డించడంకోసం యింటిలోపలికి వెళ్ళిపోయింది.

నేనూ ఆలోచనలోపడ్డాను — ఈ మానవులింతటి నిర్లిప్తతను ఎలా అలవరచుకున్నారు ? జనాభా పెరుగుదలకు, నిరుద్యోగాలకూ, నానా యాతనలకూ తమ జీవితాల్లో పునాదులు వేసు






# బ్రతుకు బాట

కుని వీళ్లింత నిశ్చింతగా ఎలా బ్రతుకుతున్నారు? ఎందుకూ పనికిరాని ఊరపిచ్చుక సైతం బిడ్డల పట్ల తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించుకుంటుంది. మానవుడి అవహేళనకు పాత్రమయ్యే కోతి గూడా తన బిడ్డల్ని సంరక్షించుకోడంలో ఎంతో జాగ్రత్త కనబరుస్తుంది. మానవుడికి ఆమాత్రం స్వధర్మ పరిజ్ఞానం లేకపోవడ మేమిటి? లేదంటే పిడుగునుంచీ బియ్యంవరకూ ఒకటే మంత్రంలాగా అన్ని అనర్థాలకూ ఆర్థికసమస్యే మూలకారణమని తృప్తిపడడానికి ప్రయత్నిస్తున్నాడు మానవుడు. అంతేగానీ తనకుతానుగా సహాయం చేసుకోలేనివాడికి భగవంతుడు గూడా సాయపడడన్న పరమసత్యాన్ని విస్మరిస్తున్నాడు. భద్రయ్యగారు హైస్కూల్లో టీచరు. ఆయన సంపాదన వందకు మించదు. ఆర్థికంగా ఆయనకు ఉండవలసిన చిక్కులన్నీ ఉన్నాయి. నిజమే గానీ రోజు కొకటి రెండుగంటల కాలాన్ని ఆయన తన పిల్లల చదువుపైన వినియోగించడానికి వీల్లేదంటే అది నమ్మడానికి వీల్లేనిమాట! చేతి కెదిగివచ్చిన కుర్రాడు, ఈపాటికి స్కూలు ఫైనలు ప్యాసై కుటుంబాని కొక ఊతకొయ్యగా నిలబడవలసినవాడు, ఫోర్తుఫారంతో చదువుకు స్వస్తిచెప్పి వీధులవెంట తిరుగుతున్నాడంటే అది భద్రయ్యగారు తలవంచుకోవలసిన విషయం. పోనీ ఆయనగారికి ప్రపంచ రాజకీయాలు, కొండవైపు షికార్లే ముఖ్యమైనవనీ, మిగిలినవన్నీ అప్రధానమైన విషయాలేననీ భావిద్దాం. ఆ తల్లికైనా తనబిడ్డల భవిష్యత్తుపట్ల ఆసక్తి లేకపోవడమేమిటి, విధివైపరీత్యం గాకపోతే!

చిట్టచివరకు నా ఆలోచన అన్ని విద్వారాలకూ కేంద్రస్థానమైన ఈ కుటుంబంలో శ్యామల జీవితం ఎలా పరిణమించబోతున్నదన్న ప్రశ్నతో పర్యవసించింది.

ఆ మరునాడు మాటల సందర్భంలో రాజేశ్వరిని ప్రశ్నించాను. "నీ స్నేహితురాలికి పెళ్లిచేసే ఉద్దేశం ఆ తల్లిదండ్రులకు ఉన్నట్టా, లేనట్టా ?" అని.

"మీదొక పాడు! వాళ్ల కాపాటి సదుద్దేశం ఉన్నట్టయితే యిక శ్యామల నేలపైన నిలిచేది గాదు ...." అంది రాజేశ్వరి.

నేను నివ్వెరపడిపోయాను. శ్యామలకు సంబంధించిన ప్రశ్నకు తోడు, నాలో మరొక ప్రశ్న ఉత్పన్నమైంది. ఏవిధంగా చూచినా శ్యామలను చుట్టుముట్టిన పరిస్థితులు అధ్వాన్నంగా ఉన్నాయి. అన్ని విధాలుగానూ శ్యామలకంటే మెరుగైన పరిస్థితులు రాజేశ్వరివి! మరైతే ఈమె ఆమెపట్ల అసహిష్ణుతను ఎందుకు ప్రకటిస్తోంది. ?

నేను మౌనంగా ఉండిపోవడం గమనించి తన అభిప్రాయాన్ని బలపరచుకోడాని కన్నట్టుగా మళ్లీ ప్రారంభించింది రాజేశ్వరి.

"కళ్లు అల్లల్లారుస్తూ, బుంగమొఖం పెట్టుకుని ఏమీ తెలియనిదానిలా కనబడుతుంది గనుక, మీరు అమ్మాయి చాలా మంచిదనుకుంటున్నారేమో! అదేం లేదు. ఆమెగారి బుర్రలో పెద్ద

పెద్ద ప్లీనులో ఉన్నాయి. చూస్తూ ఉండండి. మీకే తెలుస్తుంది...."

అలాగేనని చెప్పి శ్యామల జీవితనాటకాన్ని నేనొక ప్రేక్షకమాత్రుణ్ణిగా చూడసాగాను. ఒకటి గాదు, రెండు గాదు, నిండుగా మూడేండ్లు గడచి పోయాయి. భద్రయ్యగారు మామూలు ప్రకారం స్కూలుకు వెళ్తున్నారు. భద్రయ్యగారిభార్య తన వాడుకమేరకూ పొరుగిళ్లల్లో తన ఖాతా ఖాళీయితిహాసాన్ని కొనసాగిస్తోంది. సందొమ్మిదేండ్ల నాగరాజు తన రివాజుననుసరించి బజార్ల వెంట బలాదూర్లు తిరుగుతూనే ఉన్నాడు. ఐతే ఇంతకాలం తర్వాత ఓ విచిత్రమైనవార్త గాలిలో కలిసి పరతెంచి వచ్చింది. శ్యామల లేచి పోయిందంటే లేచిపోయిందనుకున్నారు లోకులు. ఎక్కడికి లేచిపోయింది, ఎవరితో లేచిపోయిందన్న సందేహాలు ఖొందివిగోల్పోయిన ప్రాణాల్లా గాలి లోనే తిరుగుతుండిపోయాయి.

ఈ సంఘటన జరిగిన తర్వాతకూడా ఒక్క సంవత్సరం గడిచిపోయింది. ఆనాటికీ ఈనాటికీ మళ్లీ ఈవిధంగా ప్లాట్‌ఫారంపైన ప్రత్యక్షమైంది. శ్యామల!

* * *

స్టేషనులో రైలు ఆగగానే ప్లాట్‌ఫారంపైన చెలరేగే అలజడి తనివితీరా చూచి వినోదించదగిన దృశ్యాల్లో ఒకటి! పెట్టెల్నీ, పరుపుల్నీ, బుట్టల్నీ, సంచుల్నీ చేతికి తీసుకుని ఒకరి కాళ్ల నొకరు నజ్జుగుజ్జుగా త్రొక్కేస్తూ ఎక్కేవాళ్ల నెక్కనీక, దిగేవాళ్లను దిగనీక ప్రయాణికులు పడుతున్న పాట్లను చూస్తూ నిల్చున్నానేమో, పరధ్యానంలో నుంచీ తేరుకునేసరికి తలుపులన్నీ మూసుకున్నాయి. ఏపెట్టెదగ్గరికి వెళ్లినా తావు లేదన్న నినాదమే ఎదురైంది. తావున్నా లేకున్నా ప్రయాణం చేయడం తప్పనిసరి గనుక బలవంతంగా నిరోధాన్ని తొలగించుకుని ఓపెట్టెలో ప్రవేశించాను. లోపల గుడ్డిదీపం ఒకటి వెలుగుతోంది. దూరప్రాంతాలనుంచీ వస్తున్న ప్రయాణికులు వీలైనంతమేరకూ ఆసవాలను ఆక్రమించి, పడకలు సర్దుకుని అప్పుడే కునికిపాట్లు ప్రారంభించేశారు. ఇప్పుడిప్పుడే పెట్టెలో అడుగెట్టినవాళ్లల్లో కొందరేమో ఎవరి పాద సాన్నిధ్యంలో కూర్చోడమని లోలోపల తర్క వితర్కాలకు లోనౌతున్నారు. మరికొందరుమాత్రం వ్యాయామ్యాయ పరిశీలనకు పూనుకుని యింతమంది నిలబడివుండగా ఎవరో కొందరు, బెంచీలనిలా దురాక్రమణచేయడం న్యాయంకాదని కుతర్కాలు కూడా మొదలెట్టేశారు.

"నమస్కారమండీ మేష్టరుగారూ!"

ఉలికిపడి వెనుదిరిగి చూచాను. ఓ మూలగా కిటికీదావున నిల్చునిఉంది శ్యామల.

"బాగున్నారా మేష్టరుగారూ?"

ఏదో మామూలుగానే ఉన్నానని బదులుచెప్ప దలచుకున్నాను. కానీ చెప్పనివ్వలేదు శ్యామల.

కనిపించినాగూడా మాట్లాడగూడ దను కున్నారా మేష్టరుగారూ! ఈమధ్య అలాంటి అనుభవాలు చాలా ఎదురయ్యాయి నాకు. ఎందుకో గానీ మనుష్యులందరూ మారిపోయినట్లున్నారు. బాగా పరిచయమున్నవాళ్ళుగూడా, యిదివర కెప్పుడూ చూచి ఎరుగనట్లు నేను కనుపించగానే తల వంచుకుని వెళ్లిపోతారు."

"అబ్బే! అలాంటిదేమీ లేదు శ్యామలా! మొదట నువ్వే చూచావు. పలకరించావు. లేకపోతే నేనే పలకరించేవాణ్ణి ...." అన్నాను.

అబద్ధం చెడ్డదంటారు! ఏమిటో మరి. సమయానికి అబద్ధంలా నిజం ఉపకరించదు.

"అమాత్రం దయవుంటే చాలు! అన్నట్లు, రాజేశ్వరి బాగుందా మేష్టరుగారూ!"

"రాజేశ్వరికేం శ్యామలా! నిక్షేపంగా ఉంది. లేదంటే ఆమధ్య జలుబుపట్టి, తలభారంగా తోచి కణతలకు అమృతాంజనం రాచుకుని కొన్నాళ్ల పాటు కన్నీళ్ళు కార్చుకుంది."

"అయ్యో పాపం!" ముఖం చాటుచేసుకుని నవ్వుతూ అంది శ్యామల.

కొత్తజీవితం శ్యామలపైన వేసిన ముద్ర ఎలాంటిదో తెలుసుకునేనిమిత్తం నే నొకటి, రెండుసార్లు ఆమెకేసి పరకాయించి చూచాను. శారీరకంగా చిక్కిపోయింది శ్యామల. కానీ గులాబీ రేకులో అరుణిమలా ఆమెముఖంలోనూ, కళ్ల లోనూ ఏదో నవచైతన్యం కనిపిస్తోంది. ఎర్రటి పూవులు పూసిన తెల్లటి వాయిల్ చీరలంటే శ్యామలకు యిష్టమేమో! ఎప్పటిలాగే యిప్పుడు కూడా ఆమె అలాంటి చీరతోనే ముస్తాబైంది. జడలో పువ్వు లున్నాయి. చేతిలో పుస్తకా లున్నాయి.

"పుస్తకాలవైపు చూస్తున్నారా మేష్టరుగారూ! మీకు తెలియదేమో! నేను విద్యార్థిని. ట్రెయినింగ్‌స్కూల్లో చదువుకుంటున్నాను."

"అమాత్రం ఊహించుకోగలిగాను శ్యామలా! కానీ ఇప్పు డిలా ఎక్కడికి వెళ్తున్నట్లు?" అని ప్రశ్నించాను.

"ప్రతిరోజూ సాయంత్రమూ ఇలాగే ఇంటికి వెళ్తున్నాను. ఆరు గంటలబండికే వెళ్ళిపోయేదాన్ని, ఈరో జేదో మీటింగు ఉండడంవల్ల ఆలస్యమైంది. రోజూ టిక్కెట్టు కొనుక్కోడమెందుకని పాతిక రూపాయలుపెట్టి పాసు తీసుకున్నాను. ఇలాంటి పాసులు నాలుగు కొనుక్కుంటే ఈ సంవత్సరం గడచిపోతుంది."

"ఏలాగైనా నీది వజ్రసంకల్పం శ్యామలా? అందుకే నిన్ను నేను అభినందిస్తున్నాను......" అన్నాను.

"పోనివ్వండి మేష్టరుగారూ! ఈ ప్రపంచంలో నన్ను అభినందించగలిగినవా రొక్కరే నను కున్నాను. ఇప్పు డింకొకరుగూడా ఉన్నారని తెలిసింది........"

"మరికొంచెం వివరంగా చెప్పగూడదా శ్యామలా! నేను నిన్ను అభినందిస్తున్నాను సరే! మరొక రెవరు?"

"వారే మేష్టరుగారూ! మావారు!"

"ఏమిటేమిటి?" ఇక్కడ నేను కాస్త తెచ్చి కోలు ఆశ్చర్యాన్ని ప్రదర్శించాను "పెళ్ళయిందన్న మాట! ఆమాట చెప్పవేం శ్యామలా!"

"పెళ్ళయిందన్నసంగతి తెలియకపోతే మానె, నేను లేచిపోయిన సంగతైనా తెలియదా మేష్టరు గారూ! ఆ విషయం లోకానికంతా తెలిసిపోయింది. నేనేదో చేయరానిపని చేసినట్లే భావించారు. అందరికీ

# బ్రతుకు బాట

సంజాయిషీ చెప్పుకోడం నాచేతనయ్యేపనిగాదు. కానీ అర్థంచేసుకోగలిగినవారికి చెప్పడంలో తప్పులేదు. నే నప్పుడప్పుడూ ఏకాంతంగా కూర్చుని ఆలోచించుకునేదాన్ని. మానవుడు ఏపనిచేసినా అందుకొక ప్రయోజనం ఉంటుంది. ఉండాలి కూడా! కుటుంబానికి బరువుగా బ్రతకడంకంటే అక్కడ నా బ్రతుక్కు ప్రయోజనమేమిటో తెలిసిందిగాదు. బ్రతికినంతకాలం పరిష్కరింపవలసిన సమస్యగా బ్రతుకు వెళ్ళబుచ్చడం నా కిష్టంలేదు......."

"నిజమే శ్యామలా! ఆ దృక్పథంతో చూస్తే నువ్వు చేసినపని మంచిదేననిపిస్తుంది. పైగా వివాహతతంగం కూడా జరిగిపోయింది గనుక ఇందులో వేలెత్తి చూపదగిన దోషమేమీ కనిపించడంలేదు" అన్నాను.

రైలు పరుగిడుతోంది. ఒకటి రెండు స్టేషన్లు వెనక్కుపోయాయి. తోడి ప్రయాణీకులు, పెద్ద మనసు చేసి మా కిద్దరికీ చోటు కల్పించారు. తన భర్తను గురించి, అతడి స్థితిగతులను గురించీ చెబుతోంది శ్యామల. తల్లి ఒక్కతె తప్పితే అతనికి నా అన్నవాళ్లెవ్వరూ లేరట! కుమారుడు చేసిన ప్రతి పనీ మంచిదేననుకునేపాటి మంచితనం ఆమెలో ఉందట! అతడేమంత పెద్దచదువులు గూడా చదువుకోలేదట! స్థిరంగా ఉద్యోగమంటూ ఒకటి లేదట!" ఆయనతత్వం అలాంటిది మేష్టరుగారూ! కోపం హమేషా ముక్కుపైన్నే ఉంటుంది. పిలవగానే పలుకుతుంది. కొన్ని ఉద్యోగాలు ఆయనే విసుగెత్తి మానేశారు. మరికొన్ని ఉద్యోగాల్లో పై అధికారులే ఈయనచేత మాన్పించేశారు. ఐనా పరవాలేదు. ఈ సంవత్సరం ఏదో ఒకవిధంగా గడచిపోతే ఆ తరువాత మా ఇద్దరిలో ఎవరో ఒకరు ఉద్యోగం చేస్తుంటే చాలు. బ్రతుకు సాఫీగా గడచిపోతుంది. అంతకంటే మాబోటివాళ్ళు కోరదగిందేముంది మేష్టరుగారూ!"

ఇంతలో శ్యామల దిగవలసిన స్టేషను వచ్చింది

"వెళ్లొస్తాను శ్యామలా! రాజేశ్వరితో ఏం చెప్పమంటావు?" అన్నాను.

"మరి మరీ అడిగినట్లు చెప్పండి మేష్టరుగారూ! అన్నట్లు ఇక్కడేదో తిరణాల జరుగుతుందట. జాబు వ్రాస్తాను. మీరు రాజేశ్వరితోసహా వచ్చి పోవాలి......."

"అలాగే. తప్పకుండా రావడానికి ప్రయత్నిస్తాము" అంటూ శ్యామలదగ్గర సెలవు తీసుకున్నాను.

హఠాత్తుగా శ్యామలను కలుసుకోడం తటస్థించిందనీ, ఆమె ప్రస్తుతం ట్రెయినింగ్ స్కూల్లో చదువుకుంటోందనీ, తిరణాలకు ఆహ్వానించిందనీ ఇంటికిరాగానే రాజేశ్వరితో చెప్పాను.

"అబ్బబ్బ, ఆహ్వానం కూడానా! ఎలా ముఖమెత్తుకుని మాట్లాడగలిగిందండీ మీతో! సిగ్గులేని ముఖం. ఆవిడగారు ఆహ్వానించారట! ఈయనగారొప్పుకున్నారట!" చిరచిరలాడింది రాజేశ్వరి.

*   *   *

తిరణాలకు రమ్మని శ్యామల జాబువ్రాయడమైతే జరిగిందిగానీ, ఆ జాబును నేను తిరణాల గడచిపోయిన పదిపదిహేను రోజులకుగానీ చూడ లేకపోయాను. "ఏమండోయ్! ఇక్కడేదో జాబున్నట్టుంది......" అంటూ ఓరోజు ఉదయం గూట్లోనుంచీ ఓ కార్డుముక్కనుతీసి టేబిలుపైకి విసిరింది రాజేశ్వరి. అది నెలరోజులకు మునుపు వ్రాసిన జాబు!

ఆ జాబు అలా ఆలస్యంగా నా కళ్ళపడినందుకు కారణమేమిటో నే నూహించుకోలేకపోయాను.

రోజులు గడచిపోసాగాయి. శ్యామలను గురించిన ప్రసక్తి మా కుటుంబంలో ఎప్పుడోగానీ పొడసూపేదిగాదు. పైగా గమ్యస్థానాన్ని గుర్తెరిగి నిలకడగా నిదానంగా పయనం సలుపనేర్చిన పాంథులు దారితప్పడం ఎన్నటికీ జరుగదు గనుక ఆమెను గురించి ఆలోచింపవలసిన అవసరం గూడా నాకు కనిపించేదిగాదు.

మూడేళ్ళతర్వాత ఒకానొక మిత్రుడి వివాహ సందర్భంలో పెళ్ళిపందిరక్రింద కనిపించింది శ్యామల. మళ్ళీ మునుపటిలాగే పలకరించింది. అదే ఊళ్లో పంతులమ్మగా పని చేస్తున్నట్లు చెప్పి, సాయంత్రమొకసారి తప్పకుండా ఇంటికి రావలసిందని మరి మరీ పాథేయపడింది.

పాఠశాలకు దగ్గరగా ఓ చిన్న పెంకుటింట్లో నివసిస్తోంది శ్యామల. పెరట్లో వంటచేసుకుంటున్న శ్యామల, గదిలో నిద్రపోతున్న చంటిపాప—ఈ ఇద్దరు తప్పితే ఆ ఇంట్లో మరొకరు నివసిస్తున్న సూచనలులేవు. ఆమె భర్తను గురించి ప్రస్తావించాను. అతనికింకా స్థిరమైన ఉద్యోగం దొరకలేదనీ, ఏదో కంపెనీ క్రింద ట్రావెలింగు ఏజంటుగా ఊళ్ళు తిరుగుతున్నాడనీ, ఒకటి రెండు నెలలకొకసారివచ్చి పది పది హేనురోజులపాటు ఇంటిదగ్గరవుండి మళ్ళీ వెళ్లిపోతుంటాడనీ చెప్పింది శ్యామల.

అత్తగారిని గురించి వాకబు చేశాను.

"ఆమె వుంటే ఇక లేనిదేముంది మేష్టరుగారూ! ఆమెపోయి ఏడాది కావస్తోంది. పాపను పొరుగింట్లో ఎడుకోబెట్టి స్కూలుకు వెళ్తాను. ఇంటర్వెల్లో వచ్చి చూచిపోతుంటాను. ఇలాగే దొర్లిపోతున్నాయి రోజులు."

ఐదు నిమిషాల్లో కాఫీ చేసి తీసుకొచ్చింది శ్యామల.

"మీవాళ్లెవరైనా వచ్చి చూచిపోతుంటారా శ్యామలా! పోనీ, కనీసం నీ యోగక్షేమాలైనా కనుక్కుంటూ ఉంటారా" అని ప్రశ్నించాను.

"మా అమ్మ ప్రసవానికి వచ్చివెళ్ళింది. నాగరాజు తలచుకున్నప్పుడల్లా వస్తుంటాడు. కానీ మనుషుల రాకపోకలకంటే జాబులుమాత్రం తరచుగా వస్తుంటాయి... ......." అలమారా తెరిచి రెండు మూడు ఉత్తరాల్ని పైకి తీస్తూ అంది శ్యామల—"ఇవి పోయినవారం వచ్చిన ఉత్తరాలు ఒకసారి చూస్తారా మేష్టరుగారూ!"

ఏకబిగిని మూడుత్తరాలూ చదివేశాను.

మొదటిది—భద్రయ్యగారి జాబు.

"చిరంజీవి శ్యామలకు ఆశీర్వాదాలు.

క్షేమం. నీ క్షేమం, పాపాయి క్షేమము తెలుపగోరినాను. ఇటీవల ఈ ప్రాంతంలో వ్యాపించిన విషజ్వరాల మూలంగా మన ఇంట్లో మీ అమ్మ దగ్గరినుంచీ, మీ చిన్న చెల్లెలు సుమిత్రవరకూ అందరూ కాయలా పడి లేచిన విషయం నీకు విదితమే! అప్పట్లో మందు

లకూ, సూదులకూ, పిలూ, పళ్ళూలాంటి అవసరాలకు వందరూపాయలు చాలకపోయాయి. జీతం చేతికిరాగానే బాకీలు పూర్తిగా చెల్లించుకోవలసి వచ్చింది. ప్రస్తుతం ఆర్థికంగా చెప్పుకోలేనంత ఇబ్బందుల్లో వున్నానని చెప్పడంకన్నా నేను ఎక్కువగా చెప్పలేను. ఈ జాబు చూడగానే కనీసం ఓ పాతిక రూపాయలైనా మనియార్డరు చేయగలిగితే రెండు మూడు మాసాల్లో ఆ పైకాన్ని సర్దుబాటు చేయగలను. ఎదురు చూస్తుంటాను.

ఇట్లు, మీ తండ్రి
భద్రయ్య"

రెండోది తల్లి వ్రాయించిన జాబు.

"చిరంజీవి శ్యామలకు తల్లి దీవించి వ్రాయునది. పోయినజాబులో అప్పుడప్పుడూ పాపకు ఒళ్ళు వెచ్చగిల్లుతున్నదని వ్రాసియుంటివి. ఇప్పు డెట్లున్నదో తెలుపవలసినది. జబ్బువడి లేచినతరువాత నా శరీర స్థితి మిక్కిలి నీరసముగా నున్నది. లేచి పది బారల దూరం నడిచే ఓపిక లేకున్నది. ఈ చిక్కులిట్లుండ నీ పెద్దచెల్లెలు సరోజ పదిరోజులనుంచి బడికి వెళ్ళనంటే వెళ్ళనని ఒకటే హఠము చేయుచున్నది. ఉన్న ఒకటి రెండు పావడాలు బొత్తిగా చిరుగులు పడిపోవడమే అందుకు కారణం. ఇక్కడి ఇంటి పరిస్థితులన్నీ నీకు తెలిసినవే! అందువల్ల వివరంగా వ్రాయడంలేదు. ఎలాగైనా నీలుచేసుకుని ఇరవై రూపాయలు పంపగలవని నమ్ముచున్నాను. పాపకక్షేమాలతో బదులు వ్రాసేది.

ఇట్లు, నీ తల్లి
పార్వతమ్మ."

మూడోది తమ్ముడు వ్రాసుకున్న ఉత్తరం.

"అక్కయ్యకు నమస్కారాలు.

నువ్వు చెప్పినమేరకు ఉద్యోగంకోసం ప్రయత్నిస్తున్నాను. ఒకటి రెండు బస్సుకంపెనీలు ఈనెల పైనెల అంటూ గడువు పెడుతున్నాయి. అయినా ఊరుకోకుండా నాలుగైదుచోట్లకు అప్లికేషన్లు పెట్టుకున్నాను. ఇటీవల అనంతపురంలో ఉద్యోగం చేస్తున్న మిత్రుడొకడు కనిపించి, అత డుద్యోగం చేస్తున్న ఆఫీసులో ఒక అటెండరుపోస్టు ఖాళీగా ఉందనీ, ప్రయత్నిస్తే దొరకవచ్చుననీ చెప్పాడు. నాన్నగారినడిగితే ఆయన ఉలకడమూలేదు, పలకడమూలేదు. ఈ సమయంలో నేను నిన్నే నమ్ముకున్నాను. ఏమాత్రం పంపినా సరిపెట్టుకోగలను. టి. యస్. ఓ. అయితే మంచిది. ఆశోభంగం కలిగించవని నమ్ముతున్నాను.

ఇట్లు, నీ తమ్ముడు,
నాగరాజు"

పది పదిహేను నిమిషాలు మౌనంగా గడచిపోయిన తరువాత "మీ సలహా ఏమిటి మేష్టరుగారూ!" అంది శ్యామల.

నాకు తోచినంతలో ఇలాంటి ఆర్థిక సహాయాల వల్ల ఆ కుటుంబంయొక్క అవసరాలు తీరిపోయే అవకాశాలులేవు. పోగా ఆ అవసరాలు నానాటికీ వర్ధిల్లేవే గనుక సహాయం చేయడానికి అలవాటుపడినతర్వాత శ్యామల ఆ ఊబిలోనుంచీ బయటపడడం దుస్తరం కానీ, నేను మొగమాటంవల్లనే గావచ్చు, ఈ సలహాను నిస్పష్టంగా బయటపెట్టలేకపోయాను. పామూ చావకుండా, బడితా విరక్కుండా వీలైతే సాయపడవచ్చుననీ లేకుంటే మానుకోవచ్చుననీ సూచించి, అప్పటికే ప్రొద్దుపోవడంవల్ల సెలవు తీసుకుని పెళ్ళి విడిదికి వెళ్ళిపోయాను.

* * *

"విన్నారటండీ! ఆ శ్యామలాంబగారికి కళ్ళు నెత్తిమీదికొచ్చేశాయట! మరొకరూ మరొకరూ చెప్పిన మాటకాదు. సాక్షాత్తు ఆవిడ తల్లిగారే చెప్పారు. ఇప్పు డిప్పుడు జాబులు గూడా క్రమంగా రావడంలేదట! స్వార్థానికి మారుపేరే శ్యామల అని నేను ఎన్నిసార్లు చెప్పలేదు! నామాటమీద మీకు నమ్మకం లేకపోయింది. ఇప్పు డేమంటారు?" అంది పుట్టింటికి వెళ్ళివచ్చిన రాజేశ్వరి.

ఆ పార్వతమ్మగారు ఏమని చెప్పారో, ఆ చెప్పిన విషయాన్ని ఈ రాజేశ్వరి ఎలా అర్థం చేసుకుందో నాకు తెలియదు కానీ నా కొక్క విషయంమాత్రం స్పష్టంగా తెలుసు. శ్యామల స్వయంకృషితో పరీక్ష పాసు కాగలిగింది. వలచిన వరుణ్ణి చేబట్టగలిగింది. ఉద్యోగం సంపాదించుకోగలిగింది. మనం చేయలేని పనులను ఎదుటివారు చేసి చూపించినప్పుడు వారిపట్ల మనకు ఈర్ష్య కలగడం సహజం! ఆ ఈర్ష్య ఎదుటివారిని కించపరచడమన్న మారువేషంతో ప్రకటితమౌతుంది.

ఐతే నే నీ ఊహను పెదవిదాటిపోన్వకుండా లోపలే భద్రపరుచుకున్నాను. బయటికి వెల్లడిస్తే రాజేశ్వరి ఊరుకోదని నాకు బాగా తెలుసు ఏంచేయాలి మరి! అనుకూలించని పరిస్థితుల మూలంగా సుభాషితా లిలాగే అంగమున జీర్ణమైపోతుంటాయి!



# మిత్రుల్లో హత్య

31-వ పేజీ తరువాయి

జిల్లెట్ తన అనుమానాలనుగురించి గ్లెన్‌కి ఏమీ చెప్పకుండా అతను పంపించిన 'పాకెట్' విషయమై పరిశోధనలు జరిపించాడు. కాని, పోర్ట్‌లాండ్‌లో అధికారులు, ఆ 'పాకెట్‌లో గ్లెన్ తన మిత్రుడికి కానుకగా పంపిన దుస్తులుతప్ప వేరే ఏవీ లేవని తెలిసినట్లు కబురు పంపారు.

ఇంతలో పోలీసు అధికారి జిల్లెట్ నిష్పక్షపాతంగా తన పరిశోధనలు జరుపుతూ వచ్చాడు: తనను ఈ ఉద్యోగానికి సిఫారసు చేసిన మాజీ పురపాలక సంఘం అధ్యక్షుని వ్యవహారాలు జాగ్రత్తగా అనుశీలించటం ప్రారంభించాడు. కొన్ని చిత్రమయిన విషయాలు బయటపడ్డాయి

జాన్‌స్టన్ తరఫున సాక్ష్యం ఇచ్చిన ఇద్దరు తాము అతనివద్ద ప్రతిఫలంకోరి హత్యజరిగిన సమయంలో మేయర్‌ని నగరంలో వేరే ఎక్కడో చూసినట్లు చెప్పినది అబద్ధం అని ఒప్పుకున్నారు.

జాన్‌స్టన్ వ్యాపారం అంత మంచిస్థితిలోలేదు. ఓల్సన్ కంపెనీకి బాగా బాకీ పడిపోయి ఉన్నాడు ఓల్సన్‌కి తను చెప్పినట్లు ఇచ్చానన్న 800 డాలర్లు బాంకులోనుంచి తియ్యలేదు. అసలు రసీదుమీద హంతకుడు ఇవన్నీకాక కొంత డబ్బు కూడా కాజేసినట్లు కనిపించింది. ఓల్సన్ కోటుజేబులో 40 డాలర్లు దొరికినా శనివారంనాడు జాన్‌స్టన్ ఓల్సన్‌కి 800 డాలర్లు ఇచ్చి రసీదు పుచ్చుకున్నట్లు చెప్పాడు.

జిల్లెట్‌కి ఇంకొక సంగతి తెలిసింది సోమవారం నాడు—అంటే బయటపడటానికి 24 గంటల ముందు—వాల్టర్ గ్లెన్ ఒక పెద్ద 'పాకెట్' పోర్ట్‌లాండ్ నగరానికి (ఓరెగన్ రాష్ట్రంలో) పోస్టులో పంపినట్లు తెలుసుకున్నాడు. దానిలోపల ఏముంది ?

## మంచి నడవడి

ఈ సగల వ్యాపారులు ఇద్దరూ చూడటానికి పెద్ద మనుష్యులలాగే కనిపిస్తారు! డంకాన్ జాన్‌స్టన్ ట్విన్‌ఫాల్స్ నగర పురపాలక సంఘానికి అధ్యక్షుడుగా పని చేశాడు అసలు జిల్లెట్‌కి ఈ పోలీసు ఉద్యోగం ఇప్పించింది ఆయనే.

వాల్టర్ గ్లెన్ కూడా చాలా నిజాయితీ మనిషిగా పేరుపొందాడు. వాణిజ్యమండలివారు అతను బాగా నమ్మకస్థుడని చెప్పారు.

హత్యజరిగిన వారంరోజులతర్వాత పరిశోధన ఆగిపోయినట్లు కనిపించింది. ఓల్సన్‌కారుని వేలిముద్రలకోసం వెతకగా అతనివితప్ప వేరెవరివీ దొరకలేదు. అతన్ని చంపటానికి ఉపయోగించిన 25 నంబర్ పిస్టల్‌కూడా దొరకలేదు.

ఓల్సన్ సంతకం 'ఫోర్జరీ' అని తేలిపోయింది.

అతని ఆఫీసు వెతకగా నేల క్రిందగదిలో, 15000 డాలర్ల విలువచేసే ఉంగరాలు, ఓల్సన్‌సంచి, 25 నంబర్ పిస్టల్ దొరికాయి హత్యచెయ్యటానికి ఉపయోగించిన ఆయుధం ఇదేనని పరిశోధనలవల్ల తెలిసింది.

చివరికి—జాన్‌స్టన్ అంగడి గాజు 'షోకేస్' లో ఓల్సన్ గెన్‌కి చూపించేందుకు తీసుకువచ్చిన గడియారాలు రెండూ తక్కినవాటితో అమర్చిఉన్నాయి. జాన్‌సన్ ఈ గడియారాలను అంత సులభంగా గుర్తుపడ్తారని ఊహించలేదుట.

## విచారణను ఆలస్యం

'రాజకీయాల ప్రభావం జాన్‌స్టన్ విచారణ తొందరగా జరగకుండా అడ్డుపడిందా' అనే ప్రశ్నకి సమాధానం గట్టిగా చెప్పలేము. శిక్ష విధించటానికి మాత్రం అడ్డుపడలేదు.

1938 డిసెంబర్‌నెలలో పోలీసుశాఖ అధిపతి జిల్లెట్ ముఖ్యస్నేహితుడిపైన హత్యానేరం బుజువు అయి, అతనికి మరణశిక్ష లభించింది.

(గమనిక వాల్టర్ గ్లెన్ అసలు పేరు వేరే ఉన్నా, నేరస్థుడు కానందున మారుపేరు వాడటం జరిగింది. తక్కిన వివరాలన్నీ సరియైనవి)



ఇంట్లో అడుగుపెట్టింది—యవ్వనంలోని చిలిపి చేష్టలు.

ఆమె ఎన్నిరకాలుగా, ఎన్ని రూపాల్లో తమ జీవితాన్ని సుఖ, సంతోషాలమయంచేసి తృప్తి నిచ్చిందీ .... !

లలితాసహస్రనామంతోనే ఆయనకు తెల్లవారేది.

నిద్ర లేవగానే 'లలితా' అనేవారు. ఎంతమంది నౌకర్లు—చాకర్లు ఉన్నా రావుగారి సేవను లలితమ్మగారు ఎవరికీ అప్పగించేవారు కాదు. ఇంకొకరు చేస్తే ఆమెకు తృప్తి ఉండేదికాదు. ఆయనసేవవిషయంలో ఎవర్నీ నమ్మేవారుకా రామె.

పళ్ళు తోముకునే బ్రషు కు పేస్టు వేసివ్వటంతో మొదలయేది ఆమె పతిసేవ.

''మెరపుతార''తో ఇందిర జన్మించేవరకు ''వెండిమబ్బు'' ఆమెకో బిడ్డ.

తోటసంగతి చూసుకోవటంతోనే రోజులో చాలాభాగం గడిచిపోయేది.

ఇందిర ఆగమనంతో లలితమ్మగారి గమనమంతా కూతురివైపు మళ్లింది.

కూతురు ఎదగిరావటంతో తోటబాధ్యత, రావుగారి శుశ్రూష కూతురికి అప్పచెపుతూ కొద్దికొద్దిగా వెనక్కు తప్పుకున్నారు.

తల్లికి కూతురిమీద పూర్తి నమ్మకం ఉంది.

తల్లి తనమీద ఉంచిన నమ్మకాన్ని ఇందిర వమ్ముచేయాలే దెప్పుడూ.

మొన్నమొన్నటిదాకా చిన్నపిల్లయిన ఇందిర ఈరోజు వధువు. నిన్న ఇందిరలా ఉన్న లలితమ్మ ఇప్పుడు ఎగం నెరసిన వెంట్రుకల గృహిణి.

దేహంలో యవ్వనం దిగజారిపోతోంది.

కాని ముసలితనం వచ్చేసింది అనతగ్గ వయస్సు కా దామెది. అనారోగ్యకారణంగా ఆమె వయస్సుకు మించినదానిలా అగుపిస్తోంది.

''నర్సింగ్ హోం'' ముందు కారు ఆగింది. రావుగారు తాము ముందు దిగి తరువాత తలుపుతీసి భార్యను దింపుకున్నారు.

నర్సింగ్ హోం పెద్దడాక్టరు బయటకు వచ్చి రావుగార్ని పలకరించారు.

చిక్కమగళూరులోని పెద్ద కాఫీతోట యజమాని అయిన రావుగారి పరిచయం ఉందామెకు.

డాక్టరుగారు ముప్పావుగంట లలితమ్మగారిని పరీక్షించారు. ఆఖరుకు సందేహంగా అడిగారు.

''మీ వయస్సెంత ?''

''నలభయ్యేడు.''

మళ్లీ పరీక్షించారు డాక్టరుగారు.

''మీకు జబ్బేమీ లేదు.''

''మరి నా స్థితి ఇలా ఉందేమిటి ?''

''మీకు మూడోనెలగా ఉన్నట్టు తోస్తోంది.

''ఈ వయస్సులో ! ఇన్నేళ్ల తరువాత ? నాకు కొంచెంకూడ నమ్మకంలేదు.'' — లలితమ్మగారు ఖచ్చితంగా చెప్పారు.

''రెండు నెలలు వేచి చూస్తే తేలిపోతుంది.''

''ఆ గొడవ గడిచిపోయిం దనుకున్నాను. ఇలా అవుతుందని నేను కొంచెం కూడ అనుమానించలా.''

''మీరు చాలా దుర్బలంగా ఉన్నారు. ఇంత

## వెండిమబ్బు

25-వ పేజీ తరువాయి

వయస్సయ్యాక కాసుపం టే చాలా జాగ్రత్తగా ఉండాలి.''

''నాకేమో మీమాటల్లో నమ్మకం చిక్కటం లేదు.''

''ఇలాంటి విషయాల్లో నావల్ల పొరపాటు జరగదు.''

లలితమ్మగారికి ఇందిర గుర్తుకొచ్చింది.

ఇన్ని సంవత్సరాల తరువాత తను మళ్లీ తల్లి కావటం

''ఛీ ! పెళ్లికి ఎదిగిఉన్న కూతురు ఇంట్లో ఉండగా తనకు కానుపు !''

ఇంతకుముందే కలిగిఉంటే ఇందిరకు చెల్లెళ్లు, తమ్ముళ్లు ఉండాల్సింది. చిన్న వయస్సులో పిల్ల తల్లి అయి మళ్లీ ఈ వయస్సులో ఎదిగిన కూతురుకు తను ఎలా మొహం చూపించేది ?

ఇందిర ఎంత నవ్వుకుంటుందో ?

ఊహూ, ఇందిర అంత తేలిగ్గా నవ్వేసే పిల్ల కాదు. దానిది ఎంతో నిండుహృదయం.

''పెళ్ళి కాక మునుపు నాతో ఎన్ని ఇచ్చకాలు పలికేవారు!''

''నిజమే!''

''ఇప్పుడు నా పొడే మీకు గిట్టకుండా పోయింది.''

''ఇంకా నయం. నాకింత సహనం ఉన్నందుకు నువ్వు నిజంగా సంతోషించాలి.''

కె. వసంత (నిడదవోలు)

కాని ఏదో తప్పుచేసినదానిలా ఆమె సంకోచంతో అవమానంతో కుంచించుకుపోయింది.

ఇందిరకు మొహం చూపించటమెలా ?

ఇలా అనుకుంటూనే బయటకు వచ్చారు. ఆమె వెంటనే డాక్టరుగారు కూడా వచ్చారు.

లోపలికి వెళ్లేటప్పుడు తెల్లగా పాలిపోయిన ఆమె మొహం బయటకు వచ్చేటప్పటికి ఎర్రగా అయిపోయింది.

రావుగారు ఆత్రంగా,

''ఏమయింది డాక్టర్ ?'' అని అడిగారు.

''ఏంలేదు. కాస్త వయస్సయినతరువాత ఇలా అయింది, కనుక నీరసంగా ఉన్నారు. మంచి టానిక్కు, విటమిను 'బి' మాత్రలు రాసిస్తాను. పుష్టిని కలిగించే ఆహారం తీసుకుంటూ వారానికోసారి ఇక్కడకు వచ్చి వెడుతూంటే చాలు.''

''సరే, అలాగే కానివ్వండి. కాని ఆమె కేమి జబ్బో అడగొచ్చా ?''

''చిక్కమగళూరికంతా చక్కెరపంచాలి మీరు, ఉత్త కాఫీగింజలు సరఫరాచేస్తే చాలదు'' అన్నారు డాక్టరు నవ్వుతూ.

''ఓ !''—అన్నారు రావుగారు.

ఆయన మొహంకూడా ఎర్రబడింది. ఒక్క నిమిషం తల వంచుకుని కూర్చుని మళ్ళా లేచి భార్యతోసహా మెల్లగా బయటకు వచ్చారు.

వాళ్లు కారులో కూర్చోబోతూండగా నర్సు మందు, మాత్రలచీటీ రావుగారిచేతికిచ్చి వెళ్లిపోయింది.

డాక్టరుషాపుముందు కారు ఆగగానే అంతవరకూ మౌనంగా కూర్చున్న లలితమ్మగారు,

''నాకు మందక్కర్లా'' అన్నారు.

రావుగారు జవాబివ్వకుండానే క్రిందికి దిగి వెళ్లారు. మందుకూడా కొనుక్కొని వచ్చారు.

'వెండిమబ్బు' చేరేవరకు వాళ్లిద్దరూ మాట్లాడు కోలా.

తల్లి, దండ్రుల రాకకోసం ఎదురుచూస్తూ ఇందిర దిబ్బమీద నిల్చుంది. కూతురిమొహం కనిపించగానే రావుగారి మొహంమీద మందహాసం కనిపించింది. లలితమ్మగారి మనస్సుకూడా కొంచెం తేలికపడింది.

ఎవ్వరి దర్శనమాత్రంతో తమహృదయాల్లో అమృతసంచార మవుతుందో, ఆ అమృతవర్షంచేత కలిగే సుఖమూ, ఆనందమూ, మరొక్కజీవి ఆగమనంతో మళ్లీ కలగబోతోంది.

''ఎందుక్కాకూడదూ ?''

రావుగారు భార్యవైపు చూశారు. ఆమెకూడ ఆయనవైపు చూశారు. ఇద్దరూ నవ్వారు. రావుగారు లలితమ్మగారి చెవిలో మెల్లగా,

''ఇందిరలాంటి మరో బిడ్డను వద్దనే ధైర్యం మనకులేదు'' అన్నారు.

''కాని ఈ వయసులో ....''

''ఇందిర తర్వాత నలుగురు పుట్టివుంటే ఊరుకునేవాళ్లమే గదా. ఇప్పుడు కొంత ఆలస్య మయింది. ఇందిర అత్తవారింటికి వెళ్లాక ఇంత పెద్ద ఇంట్లో మనిద్దరమే ఎలా ఉండటమా అని బెంగగా ఉండేది నాకు. ఇక ఆ బెంగ అక్కర్లేదు.''

''ఎదిగిన పిల్ల ఇందిర. వింటే ఏమనుకుంటుందో ?''

''ఏముంటుంది ? ఎగిరి గంతేస్తుంది.''

''నా నోటితో నేను చెప్పలేను బాబూ.''

''ఒద్దు. నేను చెబుతా'' — అన్నారు రావుగారు నిశ్చింతగా.

''కాని ..... '' లలితమ్మగారు రాగంతీసేలోగానే రావుగారు,

''లలితా, నేను చాలా ఆనందంగా ఉన్నాను. దాన్ని భంగం చెయ్యకు'' అన్నారు.

''నిజంగానా ?''

''ముమ్మాటికి నిజంగా.''

''అలా అయితే నే నింకేమీ యోచించను'' అన్నారు లలితమ్మగారు. ఆమెమనస్సు తేలికపడింది.

కారు ఇంటిముందున్న పోర్టికోలోకి వచ్చి ఆగే సరికి ఇందిర దిబ్బమీదనుండి దగ్గరదోవగుండా వచ్చి ఇంటిముందు నిలబడింది.

ఇందిర ఎక్కడ కంగారుపడుతుందోనని రావు

గారు నవ్వుముఖంతోనే దిగారు. తరువాత జాగ్రత్తగా భార్యను దింపుకొన్నారు.

ఇందిర దగ్గరగా వచ్చి అడిగింది.

"ఏమయిందిట నాన్నా ?"

రావుగారు ఆశ్చర్యం నటిస్తూ,

"అరే నువ్వు ఇక్కడున్నావా ? మేము వస్తూంటే దగా దిబ్బమీద ఓ ఇందిరను చూశాం. ఇప్పుడు ఇక్కడో ఇందిర. అయితే మనింట్లో ఇద్దరు ఇందిర లున్నారా ?" అన్నారు.

తండ్రివెంటనే లోపలికి వచ్చింది ఇందిర.

"ఏమయిందిట నాన్నా ?" మళ్లీ అడిగింది ఆదుర్దాగా.

"నా ప్రశ్నకు ముందు జవాబు చెప్పు."

"ఏమిటది ?"

"మనింట్లో ఇద్దరు ఇందిర లున్నారా ?"

"ఊహుం. నే నొక్కత్తినే ఉన్నాను. పరిహాసం చాల్లే నాన్నా. అసలు సంగతి చెప్పు."

"నీ ఆన్సర్ తప్పు. మనింట్లో ఇద్దరు ఇందిరలు ఉన్నారు."

"పో నాన్నా."

"నాముందున్న దొక ఇందిర."

ఇందిరకూడా పరిహాసంగా,

"ఔనౌను. ఇంకొకతె దిబ్బమీద నిల్చింది" అని నవ్వింది.

"ఊహు. మళ్లీ తప్పు చెప్తున్నావు. ఇంకొకతె దిబ్బమీద లేదు."

"మరెక్కడుంది ?"

"మీ అమ్మదగ్గర."

"పో నాన్నా, నువ్వెప్పుడూ ఇంతే .... "

"ఇంక ఆరునెలలకు మనదగ్గర కొస్తుంది."

"ఇందిర మాట సగంలోనే ఆగిపోయింది. ఆమె కళ్లు కాంతిపుంజంలాగా వెలిగాయి. ఆ కాంతి కళ్లలోంచి దిగజారి బుగ్గలమీద అలుముకుని పెదవులమీదకు వ్యాపించింది. పెదిమెలవెనుక దాక్కున్న దానిమ్మగింజల్లాంటి పలువరుస తళుక్కున మెరసింది.

జోడునక్షత్రాల మెరుపును చూస్తూ రావుగారు దగ్గర కొచ్చారు.

తండ్రి తనహృదయంలో నాటిన విషయాన్నే నెమరువేసుకుంటూ మైమరచింది. రావుగారు ఆమె భుజంపైన చేయివేసి—

"ఇందిరా" అన్నారు.

"ఏం నాన్నా ?"

"ఇకనుండి లలిత నీ తల్లికాదు."

"అవును ఇంకో ఇందిర తల్లి."

"కాదు ఆ ఇందిర వచ్చేదాకా లలిత నీబిడ్డ. నువ్వే ఆమెకి తల్లివి."

తన హృదయంలో నిండిన ఆనందాన్నంతటినీ ఒక్క చిరునవ్వులో చిందించి అక్కడినుండి వెళ్లిపోయింది ఇందిర.

లలితమ్మగారు కూతురికి మొహం చూపటానికే సిగ్గుపడుతున్నారు. చల్లగా వీచే మంద మారుతానికోసం ఎదురుచూస్తూ కూర్చున్న అలసిన బాటసారిలా కూతురి రాకను నిరీక్షిస్తూ కూర్చున్నారు.

కాని సంకోచం ఆమెను వదలలేదు.

"అమ్మా" ఇందిర పిలిచింది.

లలితమ్మగారు పలకలేదు.

"ఇకనుండి నీ ఆహారం, పోషణ అంతా నాది. నేను చెప్పినట్లు వినాలి నువ్వు."

కొన్ని కొన్ని విషయాల్లో కూతురు ఎంత కఠినురాలో తల్లికి బాగా తెలుసు.

ఆమె కుంగిపోయింది.

"ఇందిరా, ఇప్పుడు నువ్వు ఈ స్థితిలో ఉండాల్సింది. అది న్యాయంగా ఉండేది! ఇప్పుడు ..... ఇది .... అన్యాయం ..... "

"న్యాయాన్యాయాల సంగతి వదిలేసెయ్. ముందు ఇలాంటి మనోభావాలు తుడిచివెయ్యమ్మా. ఇదే నా మొదటిపని."

"ఇందిరా .... "

"ఏమిటమ్మా?"

"మోహనుడికి ఉత్తరం వ్రాసేటప్పుడు ఈ సంగతిమాత్రం వ్రాయవద్దు. నామీద ఒట్టు.

---

**తన భార్యని ఐదేళ్లుగా పలకరించనిమాట నిజమేనని ప్రతివాది కోర్టులో ఒప్పుకున్నాడు.**

**"కట్టుకున్న భార్యతో అంతకాలం మాట్లాడకపోవటానికి నువ్వు చెప్పే నజాయిషీ ఏమిటి?" న్యాయమూర్తి గద్దించి అడిగాడు.**

**"అట్టే ఏమీ లేదండీ! ఆమెకు అడ్డు చెప్పటం ఇష్టం లేకపోయింది. అంతే"**

బి. శ్యామలాదేవి (రాజమండ్రి)

---

మా అత్తగారి కిదేమి చేటు ఈ వయస్సులో—అనుకునేదు."

"నాకు కలిగిన సంతోషాన్ని ఆయనతో పంచుకుంటేనే కదమ్మా నాకు తృప్తిగా ఉంటుంది."

"నిన్ను బతిమాలుకుంటాను ఇందిరా. ఆపని మాత్రం చేయొద్దు. రాశావంటే నీతో మాట్లాడను చూసుకో."

"తరువాతైనా తెలుస్తుంది కదమ్మా."

"అప్పుడు తెలిస్తే ఏం ఫరవాలేదులే. ఇప్పుడు నువ్వుకాని, ఆయన కాని తెలుపనే కూడదు. ఇప్పుడే ఆతనికి ఎలా మొహం చూపడమా అని చస్తున్నాను."

"ఛ, అవేం మాటలమ్మా."

"దేనికైనా ఒక కాలమంటూ ఉంటుంది. అది దాటిందంటే ఇహ బాగుండదు. ఇపుడు నాకు బదులు నీకు అయ్యుంటే .... "

"పెళ్లి కాకుండానేనా ? ఇంకేమన్నా ఉందా ? నన్ను ఇంటినుండి తరిమేసేదానివి" అంది ఇందిర కొంటెగా నవ్వి.

"నీకు పెళ్లయి నీకు అయివుంటే ? ఓహో నా సంతోషానికి హద్దుండేది కాదు."

"ఇప్పుడు నేనూ అంతే సంతోషిస్తున్నానమ్మా."

ఇందిర తనహృదయంలోని మాటనే తల్లి ముందు విప్పి చెప్పింది.

పెళ్లయిన చాలాకాలానికి గర్భవతి అయిన కూతుర్ని చూసి పొంగిపోయే తల్లిలా ఇందిర పొంగిపోతోంది.

విశాలమైన 'వెండిమబ్బు' లో చేతితో కత్తి పట్టుకుని తిరిగేటప్పుడు తనకు తోడుగా ఎవరన్నా ఉంటే బాగుండే దనిపించేది ఇందిరకు.

కబుర్లు, కష్టసుఖాలు చెప్పుకోవడానికి తనకు చెల్లెలో, తమ్ముడో ఉంటే అని ఆలోచించేది ఇందిరమనస్సు.

కాని ఇంతవరకు ఆ ఆశ సఫలంకాలేదు. ఇక లేదని వదలుకున్న కోరిక అకస్మాత్తుగా చిగురించేసరికి ఇందిర ఆనందంతో ఉక్కిరిబిక్కిరయింది.

తమ్ముడో చెల్లెలో ఎవరైనా సరే.

మోహనుడు వచ్చేవరకూ తనకిక విసుగువిపించదు. లాలించడానికో పసికందు ఉంటుంది. దాని పోషణలో, మోహనుడికి ఉత్తరాలు రాయటంలో తనకాలం సులభంగా గడిచిపోతుంది.

మోహనుడు ఈ విషయం వింటె ఎంత సంతోషిస్తాడో ?

కాని .... అమ్మ ఎందుకు వద్దంటోంది ?

ఇందిర నిరాశతో "అయితే అమ్మా ఆయనకు రాయకూడదా ?" అంది.

"ఊహు. నా చేతిలో చేయివేసి చెప్పు వ్రాయనని"

"అలా చెయ్యను కాని, ఆయనకు రాయనులే. నామాట నమ్ముతావుగా."

"నమ్ముతాను."

"కాని నాన్న రాస్తే ?"

"లేదు. నేను ఒద్దంటే ఆయన వ్రాయరు" అంటూ ఉండగానే రావుగారు అక్కడకు వచ్చారు.

"తల్లీ, కూతురు చాలాచాలా మాట్లాడుకుంటున్నట్టున్నారే."

"అదికాదు నాన్నా. అమ్మంటోంది చూడు ..." అని ప్రారంభించింది ఇందిర.

"మీకు పుణ్యముంటుంది అల్లుడి కీసంగతి తెలుపకండి." అంటూ బతిమాలుకొన్నారు లలితమ్మగారు. రావుగారు ఆశ్చర్యపోయారు.

"ఏం ?"

"ఏమిటో నాకు చాలా చిన్నతనంగా ఉంటుంది. ఈ వయసులో .... ఇలా .... "

"ఎవరూ చేయని తప్పు మనమేమీ చెయ్యలేదే. నువ్వూ ఋషిపంచమి చేయలేదుగా ఇకనేం?"

"చాల్లెండి. మీ మాటలూ మీరూను ఎదిగిన పిల్ల ముందు ..... "

"మరి నువ్వో ఎదిగిన పాపాయివి."

"మీరేమన్నా అనుకోండి. నామాటమట్టుకు తోసివేయకండి."

భార్య ఇలాంటి పరిస్థితుల్లో ఉన్నప్పుడు

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది.

# జ్వరచిహ్నాలు, ఫ్లూలనుంచి

జ్వరచిహ్నాలతో ఎణుకుగాను, అస్వస్థతగానువుందా? లేకపోతే ఫ్లూగాని వచ్చిందా? 'ఆస్ప్రో' వేసుకొని జ్వరాన్ని తగ్గించుకొనండి ప్రపంచంలో లక్షలాది మందికి కుటుంబ ఔషధం. 'ఆస్ప్రో' మీ శరీరంలో బాధిత భాగాలమీద నేరుగా పనిచేసి, సత్వర బాధనివారణ కలిగిస్తుంది. ఇంటిల్లపాదికోసం 'ఆస్ప్రో' దగ్గిర వుంచుకొనండి.

## పూర్తిగా విముక్తి పొందండి

# 'ఆస్ప్రో'

## ఇంటిల్లపాదికీ



### "ఆస్ప్రో" పనిచేసే విధం చూడండి



**విడిపోతుంది**
'ఆస్ప్రో' వేసుకోగానే విడిపోవడం మొదలు పెడుతుంది. 'ఆస్ప్రో' వర్క్ కొన్ని క్షణాలలో మొదలౌతుంది.



**వ్యాపిస్తుంది**
లక్షలాది సూక్ష్మకణాలు మీ రక్త ప్రవాహంలో అతి త్వరగా బాధిత భాగాలు చేరతాయి. శమనం ఉపశమనం మొదలౌతుంది



**నివారిస్తుంది**
బాధ నివారించగానే 'ఆస్ప్రో' మీ శరీరంనుంచి ఉపసంహరించుకొంటుంది. మిమ్ము ఆరోగ్యంగా, ఆనందంగా వుంచుతుంది.

రోజా, ఊదారంగుగల సీలుచేసిన పట్టీ కావాలని అడగండి




## 'ఆస్ప్రో' తీసుకొనండి
## తిరిగి నిజముగా స్వస్థత పొందండి

నికొలాస్‌వారి (N) తయారు నాణ్యతకు మరియు శుద్ధతకు మీకు గ్యారంటీ కలదు

నీభర్త మాత్రం—భార్యను ప్రాణప్రదంగా ప్రేమించే నీ భర్త—ఆమెకోరికను నిరాకరించగలడు

"కాని అప్పుడు మాత్రం నువ్వెంతవద్దన్నా వినను."

"అప్పుడు మానుకుందాంలెండి" అన్నారు లలితమ్మగారు.

* * *

అప్పటినుండి ఇందిర తల్లికి పరిచర్యలు చేయటం ప్రారంభించింది. దైహికంగానూ, మానసికంగానూ తల్లికి ఏవిధమైన ఆయాసమూ కలుగకుండా జాగ్రత్తవహించేది.

ఆమె మనసులో ఏదైనా అనుకుంటూఉండగానే కనిపెట్టి అది నెరవేరేటట్టుగా చూసేది ఇందిర.

కూతురి ఉపచారం, సేవలవల్ల కొన్నిమార్లు తల్లి ఎంతో ప్రసన్నురాలయ్యేది. ఒక్కోసారి కోపమూ తెచ్చుకునేది.

లలితమ్మగారు ఉద్వేగపడకుండా ప్రసన్న చిత్తంతో ఉండడానికి తండ్రీ కూతుళ్ళు సదా ప్రయత్నిస్తూ ఉండేవారు.

రోజూ ఉదయం రావుగారు, లలితమ్మగారు తోటలో కాస్సేపు తిరిగివచ్చేవారు. అపుడు ఇందిర వాళ్ళతో వెళ్ళేదికాదు. వంటింటి పర్యవేక్షణతోనో, తోటపనులలోనో కాలం గడిచిపోయే దామెకు.

సాయంత్రం ఎండ తగ్గాక ముగ్గురూ షికారుకు వెళ్ళేవాళ్ళు.

రెండురోజులకోసారి కూతురు బలవంతంగా తనకు తలంటిపోసినప్పుడు లలితమ్మగారు మరింత కోపగించుకునేవారు. తలకు నీళ్ళుపోసినతరువాత సాంబ్రాణిపొగ వేసేటప్పుడంతా ఆమె చెపుతూండేది.

"ఇప్పుడుకాదే సాంబ్రాణిపొగ వేసేది. తరువాత......"

"నేనేమో ఇప్పట్నుండే వేస్తాను."

"మరీ మితిమీరిపోతున్నావు నువ్వు"—అంటూ మొహం త్రిప్పుకొనే వారామె.

ఎదిగిన కూతుర్ని ఇంట్లో పెట్టుకుని ఈ పరిస్థితి తెచ్చుకున్నందుకు ఆమె ఒకవైపు కుమిలిపోతూనేఉంది. కూతురికి మొహం చూపించలేక నేరస్థురాలిలా మొహం చాటు చేసుకుని తిరగటానికి ప్రయత్నిస్తూంది.

తండ్రీ—కూతుళ్ళ మితిమీరిన ఉపచారం ఆమెను మరింత సిగ్గుపరుస్తోంది.

భార్యను అప్పుడప్పుడూ కారులో చిక్కమగళూరు తీసుకునివెళ్ళటం ఇష్టంలేక డాక్టరుగారినే ఇంటికి పిలిపించేవారు రావుగారు.

"వెండిమబ్బు"లోని కూలీలుమొదలుకొని రావుగారివరకూ అందరూ ఎంతో ఉత్సాహంగా ఉన్నారు.

ఉత్సవానికై ఎదురుచూసేవాళ్ళలా అతి సంతోషంతో, ఆత్రంగా ఎదురుచూస్తున్నారు.

ఇందిర, రావుగార్లకంటె ఎక్కువ సంతోష పడుతున్నాడు పుట్టయ్య.

రావుగారంటె అపారమైన అభిమానమున్నా, అభిమానంతోపాటు గౌరవంకూడ కలసినందువల్ల రావుగారికన్నా లలితమ్మగారిదగ్గరే ఎక్కువ చనువు పుట్టయ్యకు.

# వెండిమబ్బు

లలితమ్మ గృహిణిగా "వెండిమబ్బు"లో అడుగు పెట్టినప్పుడే పుట్టయ్యకూడా వచ్చిచేరాడు. తీరికయినప్పుడల్లా "'అమ్మా, అమ్మా' అంటూ ఆమెచుట్టూ తిరిగేవాడు. రావుగారితో చెప్పుకోవటానికి వీల్లేని తన సంసారపు కష్టసుఖాలను లలితమ్మగారివద్ద చెప్పుకొని ఆమె సలహాలు పొందేవాడు.

లలితమ్మగారంటె అతడికి ఎంతో విశ్వాసం, అభిమానం.

ఇప్పుడు అస్తమానం ఇందిరను ఏడిపించడమే అతడిపని.

"అమ్మాయిగారూ, ఇక మీకాలం అయిపోయింది. ఇంక రెండే నెలలు 'వెండిమబ్బు'లో మీ దర్బారు. అంతలోనే మీ వైభవాన్నంతా ముగించేసుకోండి..." అనేవా డతడు.

"సరేలే. నువ్వొకడివి........"

"తరువాత నిన్నెవరూ మాట్లాడించరులే!"

"ఒద్దు!"

"అందుకేనేమిటి అమ్మాయిగారూ మోహన్ రావుగారితో పారిపోవాలనుకుంటున్నారు?"—పుట్టయ్య ఇందిరను ఉడికించేవాడు.

"ఉహూ, నేను వెళ్ళిపోవాలనుకుంటున్నది అందుకు కాదు. నీ బాధ పడలేక—"

"చిన్నారిబాబు వచ్చాక నిన్నెవరూ మాట్లాడించరుగదా అని నీ భయం."

"కానేకాదు!"

"సరేలే అమ్మాయ్, నీకు తమ్ముడు కావాలా? చెల్లెలా?"

"ఇద్దరూ కావాలి"

"బాబోయ్, అత్యాశ నేరం కాదా?" లలితమ్మగారు నవ్వారు.

"నీ కెవరుకావాలి ఇందిరా?" మళ్ళీ అడిగాడు పుట్టయ్య.

"నా కెవరూలేరు కనుక ఎవరైనా సంతోషమే"

"అమ్మా, మరి మీకో?" అన్నాడు పుట్టయ్య.

ఈసారి కొడుకు నెత్తుకోవాలని ఆపేక్షగా ఉందామెకు.

కాని ఆడపిల్ల పుడితే?

ఆడపిల్ల అయితేమాత్రం పారవేస్తారా ఏం?

పుట్టయ్య ఆమె జవాబుకోసం ఎదురుచూస్తూ నడుములోంచి పొడుండబ్బీ తీశాడు.

"ఓ, వెనక్కివద!" అంది ఇందిర.

"అమ్మాయ్"

"కొంచెం బయటకు వెళ్ళుబాబూ, నీ పొడుం ఘాటుకు అమ్మకు తుమ్ములొస్తాయి" అంటూ పంపించివేసింది ఇందిర.

వెళ్ళిన రెండునిమిషాల్లోనే పుట్టయ్య తిరిగికొచ్చి, "ఇప్పుడు నువ్వే నా దగ్గరకొస్తావ్!" అంటూ చేతిలో కవరు చూపించి నవ్వాడు.

ఇందిర అతివేగంగా ముందుకొచ్చి కవరు లాక్కుని గదిలోకి పారిపోయింది.

(సశేషం)



అల్లుకున్న ఆ పొదరింటి తీగల మాటున దాక్కున్నాడు. తన శరీరం రవంతయినా పైకి కనబడకుండా చాలా జాగ్రత్తపడ్డాడు. ఊపిరికూడా విడవకుండా మకారిరో రాక కోసం నిరీక్షించాడు. అప్పటికి పొద్దు పడమటికొండ మీదికి వాలింది. పిట్టలు గుంపులు గుంపులుగా తమ గూళ్ళు చేరుకొంటున్నాయి. ఆ తరవాత నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ మకారిరో అక్కడికి వచ్చాడు. అతని చేతిలో విల్లమ్ములు సాయంకాలం నీరెండలో తళతళ మెరిశాయి. మకారిరో చిరునవ్వు చిలకరిస్తూ మిన్నెహాహా దగ్గరికి వచ్చాడు:

'మిన్నెహాహా! నేను పిలిచిన పిలుపు వినపడలేదా? ఏం చేస్తున్నావిక్కడ?'

'నా లేడిపిల్ల కనిపించడంలేదు! చెంగు చెంగున గంతులువేస్తూ ఎక్కడికి వెళ్లిపోయిందో మరి! ఎంత వెతకినా కనిపించడం లేదు!'

'అ ఎక్కడికి వెళుతుంది! ఏ పొదరింటిలోనో నెమరు వేసుకుంటూ కూర్చుందేమో! సరే. దానికేమిగాని ఏవేవో మాటలు వినిపిస్తున్నాయేమిటి?'

ఆ ప్రశ్న వినీవినగానే మిన్నెహాహా ఉలిక్కిపడింది! అయినా తమాయించుకుంది:

'మాటలేమున్నాయి! ఆ లేడిపిల్లని మాటిమాటికి గొంతెత్తి పిలుస్తున్నాను! అంతలోనే ఇంకొక లేడిపిల్ల ఏదో యాదాలాభంగా దగ్గిరికివస్తే 'నువ్వుకాదులే! వెళ్లిపో! వెళ్ళిపో!'అని అంటున్నాను. అంతే! ఇక్కడ నాతో మాట్లాడడానికింకెవరున్నారు!'

'ఓహో! అలాగా నేనేదో పొర

# హాయవాతా అద్భుతగాథ

24-వ పేజీ తరువాయి

బాటుగా విన్నట్టున్నాను. అయితే చీకటి పడుతూంది! ఈపాటికింటికిరా!'

కాని మిన్నెహాహా దాని కంగీకరించలేదు. ఆ లేడిపిల్లని వెదికి పట్టుకున్నాకగాని తిరిగి రానని గునిసింది. 'అదే కనిపిస్తుందిలే! భయంలేదులే!' అని ఓదార్చి మకారిరో తిరిగి ఇంటిలోకివెళ్ళి దీపంవెలిగించి దాని వెలుగులో రకరకాల బాణాల తయారీలో పడ్డాడు. ఆపైన మిన్నె

"అయితే ఈయేడు మీరు ఢిల్లీ వెళ్లటం లేదన్నమాట?"

"కాదు కాదు! ఈ ఏడు మేం వెళ్ళదల్చుకోందిబొంబాయి. ఢిల్లీ వెళ్లదల్చుకోంది పోయిన ఏడు."

ఎం. నరసింహులు (మెదక్)

హాహా చూపు పొదరింటివైపు తిరిగింది. హాయవాతా ఒక్క అంగలో పొదరింటి మధ్యనించి బయటపడి ఆమెదగ్గరికివచ్చి 'మిన్నెహాహా! ఈ జన్మలోని ఋణం తీర్చుకోలేను! నా ప్రాణం రక్షించావు!' అన్నాడు.

'మా నాయనగారు వచ్చినా భయంలేదన్నావే! మరి ఎందుకంతగా భయపడి పోయావు!'

'నా ప్రాణంకోసం భయపడ్డాననుకొన్నావా! లేదు! నీమాట కాదనలేక పోనీ అని ఆ పొదరింటిలో దాక్కున్నాను. అంతే!' అని కలకలనవ్వాడు హాయవాతా!

మిన్నెహాహా తలవంచుకొని కాలి బొటనవేలుతో నేల మీద రాస్తూ 'పోనీలే! ప్రాణాలతో బ్రతికి బయటపడ్డావుగా! ఇప్పటికయినా మించిపోయిందేమి లేదులే! తిరిగి ఇంటికి వెళ్ళిపో!' అని ఒక నిట్టూర్పు విడిచిపెట్టింది. హాయవాతా రెప్పపాటు లేకుండా ఆమెముఖవైఖరి చాలా జాగ్రత్తగా పరిశీలించి బ్రతిమాలుకొన్నాడు:

'మిన్నెహాహా! వెయ్యిచెప్పు! లక్షచెప్పు! నేనింక నిన్ను విడిచిపెట్టి ఇంటికి వెళ్ళదలుచుకోలేదు! ఏది ఏమయినాసరే! నీ పాదాల దగ్గిరే ప్రాణాలు విడిచిపెట్టాలని నిశ్చయించుకున్నాను. దీనికిక తిరుగులేదు! ముమ్మాటికి నిజం! నామాట నమ్ము!'

'ఒకవేళ మా నాయనగారు మళ్లీ ఇక్కడికి వస్తేనో!'

'వచ్చినాసరే! మరి పొదరింటిలో దాక్కోదలుచుకోలేదు! అంతే! ఆయన చంపివేసినా నాకిష్టమే! ఆహా! అంతకంటె మరి కోరుకోవలసింది ఏముంది!'

'మరి మొట్టమొదట బాణాల కోసం వచ్చానన్నావే!'

'ఆ మాట నిజమే! కాని నీ క్రీగంటి చూపుల బాణాలకేసి చూసిన తరవాత ఆ సంగతే మరిచిపోయాను.' అని చిన్న చిరునవ్వు చిలకరించాడు హాయవాతా! మిన్నెహాహా గిరుక్కున ముఖం తిప్పివేసుకుని 'ఏమో మరి! నీమాటలు నమ్మడానికి వీలు లేదు! ఇంతకీ నా లేడిపిల్ల ఏమయిందో!' అని అక్కడినించి బయలుదేరి అల్లంతదూరంలో ఉన్న కోనేరుగట్టు మీదికి వెళ్ళి నాలుగు వైపుల పరకాయించి ఒక లేడిపిల్లని పట్టుకుని అదేపనిగా దాని ముఖం మీద ముద్దులు కురిపించింది.

హాయవాతా ఆమె ధోరణి

కనిపెట్టి నిలువునా నిర్ఘాంతపడ్డాడు. 'ఇదేమిటి? ఇంతకుమునుపు నాతో ఆ లేడిపిల్ల మాట చెప్పలేదే! దాని కోసం వెతుకుతున్నట్టయినా కనబడలేదే! ఇక నేనేమి చెయ్యాలి! ఎక్కడికి వెళ్లాలి! ఎంతసేపని ఈ పొదరింటిలో నక్కి ఉండగలను! ఒకవేళ మిన్నేహాహా మళ్లీ తిరిగి రాకపోతే! మరి బాణాల మాట మిటి?' అని అనేకవిధాల మథన పడ్డాడు.

ఆపైన అతనికొక పెద్దధ్వని వినిపించింది. 'మిన్నేహాహాగాని కోనేటిలో ఉరకలేదుగదా!' అని ఎంతో కంగారుపడ్డాడు హాయవాతా! అంతలోనే 'అయ్యో! మునిగిపోతున్నాను! మునిగిపోతున్నాను! రక్షించండి! రక్షించండి! మునిగిపోతున్నాను.' అని పెద్ద ఆర్తనాదం వినిపించింది. వెనువెంటనే కోనేటిదగ్గరికి పరిగెత్తాడు హాయవాతా! మిన్నేహాహా ఒకచేత్తో లేడిపిల్లని ఎత్తుకొని రెండవచేత్తో ఆ కోనేటిలో కెరటాలలోపడి ఈదుతూ మధ్యమధ్యని మునిగిపోతూ గట్టిగా కేకలు పెడుతూంది! ఆ భయంకరదృశ్యం చూడగానే హాయవాతా గుండె ఆగింది. మరుక్షణంలోనే ఆకోనేటిలో ఉరికి గబగబా ఈదుకుంటూ మిన్నేహాహా దగ్గిరికి వెళ్లిపోయాడు. మునిగిపోతూన్న ఆమెను గట్టిగా అదిమి పట్టుకుని 'భయంలేదులే! భయం లేదులే!' అని ఓదార్చాడు. లేడి పిల్లతోబాటు మిన్నేహాహాని నెమ్మదినెమ్మదిగా ఒడ్డుమీదికి తీసుకువచ్చాడు. కాని ఆమెకెక్కడ ఒంటిమీద స్పృహఉన్నట్టు కనబడలేదు. నాడి పరీక్షించాడు. అది ఆగిఆగి కొట్టుకుంటూ ఉంది. మరి భయంలేదనుకొని చెక్కిలిమీద పెదవిచేర్చి నెమ్మదిగా 'మిన్నేహాహా! మిన్నేహాహా!' అని పిలిచాడు. ఆమెకళ్లు కొంచెం తెరిచింది. మళ్ళీ గట్టిగా మూసివేసి 'అయ్యో! మునిగిపోతున్నాను. రక్షించండి! రక్షించండి!' అని గొంతెత్తి అరిచింది.

అంతలోనే మకారియో తొందరతొందరగా అక్కడికివచ్చి కుమార్తె పరిస్థితి చూచి బాగా భయపడి హాయవాతాకేసి తిరిగి 'ఎవరు నువ్వు?' అని ప్రశ్నించాడు. ఆ పైన మిన్నేహాహా కళ్లు తెరిచింది. అది గమనించి హాయవాతా మకారియోతో తనసంగతి చెప్పాడు:

'అయ్యా! నేనొక పరదేశిని.

---

"ఏం పాపా! నీ కెప్పుడైనా ఇంటిదిగులు కలుగుతుందా?" హాస్టల్ వార్డెన్ ఆ అమ్మాయిని లాలనగా అడిగాడు.

"కలగకేం! కాని ఇంటి కెళ్ళినప్పుడే కలుగుతుంది." పాప సమాధానం చెప్పింది.

ఎ. కాశీశ్వరరావు (మచిలీపట్టణం)

---

అదిగో ఆదారమ్మట తిరిగి మా దేశానికి వెడుతూంటే అకస్మాత్తుగా ఈమె ఆర్తనాదం వినిపించింది. ఇక్కడికి వచ్చేసరికి కోనేటిసీటిలో మునిగిపోతున్నది. మరొక్క క్షణం ఆలస్యం అయితే మునిగిపోవలసిందే! ఎలాగో అలాగ కష్టపడి లేడిపిల్లతో ఒడ్డుమీదికి చేర్చాను. ఇదిగో, ఇప్పుడే కళ్ళు తెరిచింది. మరి ప్రాణాపాయం లేదనుకుంటాను.'

ఆపైన మిన్నేహాహా తండ్రి వైపు తిరిగి గద్గదస్వరంతో తనకథ మొదలుపెట్టింది:

'అయ్యో! ఎంతపని జరిగిందీవేళ! లేడిపిల్ల దేన్నిచూసి జడుసుకుందోమరి! చెంగుచెంగున గంతులువేస్తూ కోనేటిలో పడింది. వెంటనే దానికోసం నేను దూకాను. లేడిపిల్లప్రాణం రక్షించాను. కాని ఎంతసేపటికీ కాళ్ళకి నేల తగలలేదు. నాకు ఈత బాగారాదు. ఊపిరాడక నీటిలోపడి గుటకలువేస్తున్నాను. అంతలోనే ఈయనెవరో వచ్చి రక్షించారు. లేకపోతే నేనీపాటికి మునిగిపోవలిసిందే!'

మిన్నేహాహా ఎంతోకష్టంమీద లేచి కూర్చుంది. చిందరవందరగా ఉన్న దుస్తులు సరిచేసుకుంది. కుమార్తె ప్రాణాపద తప్పించినందుకు మకారియో హాయవాతాకి తన కృతజ్ఞత తెలియజేసి పుట్టుపూర్వోత్తరాలు, పేరు అడిగాడు. కాని హాయవాతా తన అసలుపేరు బయటపెట్టక మరో పేరు చెప్పాడు. తిరిగి తనఇంటికి వెళ్లిపోవాలనీ పొద్దుపోయిందనీ సెలవిప్పించవలసినదనీ అడిగాడు. కాని మకారియో దాని కంగీకరించలేదు:

"నాయనా! నువ్వెవరవో దేవకుమారుడవుగాని మానవమాత్రుడవు కావు. తలవనితలంపుగావచ్చి మా అమ్మాయి ప్రాణం రక్షించావు. నాలుగయిదురోజులపాటు నా ఆతిథ్యం స్వీకరిస్తే చాలా సంతోషిస్తాను. ఆతరవాత తిరిగి మీఇంటికి వెళ్ళిపోవచ్చును. ఇంతమాత్రంచేత మించిపోయేదేదీఉండదులే! ఈలోగా మిన్నేహాహాకూడా కొంచెం తేరుకుంటుంది.'

హాయవాతా లోలోపల కోరుకున్నది అదే! అందుచేత మొట్టమొదట కొంచెం బెట్టుసరిచేసి మళ్లీ అడిగించుకుని సరే అని అంగీకరించాడు.

ఇంకా ఉంది









# విడీ విడని చిక్కులు

23-వ పేజీ తరువాయి

ఏమిటీ ? .... అదే, బియ్యే ప్యాసయ్యేది. అతగాడి బోడి వందరూపాయలు దాని తాహతా ?" అని కూతుర్ని తల్చుకుని మరీ మరీ గర్వపడ్డదామె.

జయరావుగారు నవ్వుతూ, గుస్తులు మార్చుకుని భార్యకేసి "ఎంత అమాయకురాలివే నన్నట్లు చూసి "ఐతే నీ ఉద్దేశ్యంలో ఆ సూర్యం మన పిల్లని, నచ్చితీరుతాడని ధైర్యమే నన్నమాట ?" అన్నాడు.

"అబ్బోరి ! అసలు సంగతి బయటికి పొక్కిందో .... ఈ పిల్లడికి యే బ్రాహ్మడు తన కూతుర్నిస్తాడు ? సాంప్రదాయమా ? చట్టుబండలా ...." మూతి తిప్పింది సుందరమ్మగారు

"ఆమాట నువ్వు నమ్మాలి ! ఆ నరసమ్మ నమ్మాలి, తప్ప, నేను నమ్మను ... నిక్షేపంలాంటి ఆస్తి. ఉద్యోగం ఉన్నాయి. వెనకా ముందు ఎవరూ లేరు .... ఈ సమ్మంధం దొరికిందో యెవరేనా యెగురేసుకుపోతారు." "జయరావుగారు భార్యకు అసలురహస్యం చెప్పేశాడు. "కట్నం కూడా పదివేలు పలికిస్తారు తెలుసా ?" అన్నాడు

సుందరమ్మగారికి గుండె ఝల్లుమంది. "ఔను నిజమే. ఈ రోజుల్లో మగాడు దొరికితే చాలునని చూస్తున్నారు ? కదా " అని నాలుగు క్షణాలు ఆలోచించుకుంది. గుండెలమీద చెయ్యి వేసుకుంది

ఆమె బేలమొహం చూసి జయరావుగారు నవ్వాడు. తుండుతో వీపు గోక్కుంటూ 'అయ్యో పిచ్చిదానా ? నరసమ్మగారు ఆ కుర్రాడికి తండ్రి లేచిపోయేడని, అప్పచెల్లెలు పారిపోయిందనీ .... చెప్పకుండా గుట్టుగా ఉంచిందే ! తెలుసా ?" అన్నాడు.

"ఎంతమాట ?" అన్నది సుందరమ్మగారు ఆశ్చర్యంతో నోరు నొక్కుకుని.

"అందుకనే ఆ పిల్లాడి సంగతి యెలాగున్నా ఆవిడ మన చేతిలో చిక్కింది పోతే కుర్రాడు కాస్త సోళుసుగా ఉన్నాడనుకో .... ఆఁ .... అదీ యెన్నాళ్ళు ? 'ఇదిరా బాబూ ! నీ కుటుంబం, నీసాంప్రదాయం....' అని ఓ మంచిరోజు చూసి చెవిలో ఊదేవా" .... దుష్టగా నవ్వేడు జయరావుగారు.

"అసలింతకీ మీ బావ చంద్రమౌళి జాడ గాని, ఆ పిల్లదాని జాడగాని తెలిసిందండీ ?"

సుందరమ్మగారు భర్తనుదుట పడ్డ ముడుతలను పరిశీలించిందికా అన్నట్లు దగ్గిరిసా వెళ్ళి అడిగింది.

"ఏమో మరి ?" అన్నాడు జయరావుగారు దీర్ఘాలోచనలో పడ్డట్లు.

"ఇరవై యేళ్ళనాటి సంగతి .... మాబావ ఉంచుకున్నది కడుపుతో ఉందనే, అసలు వాడు దాంతో పరారీ అవుత .... ఐతే నిజంగా ఆముండ అప్సర్స సుమా ! .... మా పెద్ద మాటకారి .... " అని, ఏమో చెప్పబోతూ గభిక్కున మనస్సు మగ్గబట్టుకుని "మా బావ ప్రతికివస్తాడని మరి నమ్మకంలేదు ... కాని మొన్న గురివిశెట్టి బెనారస్ పోయొచ్చేడుగా అతగా డన్నాడూ" అని మాట మార్చి భార్యకేసి తిరిగి "పద పద వడ్డించు" మన్నాడు.

" 'గురివిశెట్టి' ఏమన్నా డేమిటండీ ? అతగాడు చూశాడటనా ?" కుతూహలం ప్రకటించింది సుందరమ్మగారు

"ఆ కనకదుర్గ అవునో కాదో గాని ఓ, తెలుగు పిల్లే .... ఒకర్తి కనకదుర్గ అన్న పేరుగలదీ, దాని పిల్ల లిద్దరూ, ఒక బెంగాలీవాడూ అంటే దాని భర్త కాబోలు కలిసేరట .... "

భార్యమొహంలోని ఆందోళనకు నవ్వుతూ 'రైల్లో నటలే .... మన ఊళ్ళో కాదు' అన్నాడు గట్టిగా.

"అది సరేగాని ఈపిల్లాడు .... పే రేమిటీ?.... సూర్యంకదూ?...ఎలా ఉంటాడండీ ? .... నర్సమ్మగారు కట్నం యెంతలో ఉంచిందీ ?"—ఆమె కాబోయే అల్లుడిగురించి తలపోస్తూ మరింత అన్నం భర్త విస్తట్లో వడ్డించింది.

"సరిపోయింది .... నే నింకా ఆమాట కద పందే .... అదిగాక ముసిల్ది మంచం యెక్కింది గూడాను .. ఇక వాడా ? కొంచెం తలబిరుసు!, గాని అంతా నా పోలికే ... మేనమామనికదా మరి ?" అని గర్వంగా భార్యను క్రీగంట వీక్షించేడు.

ఆవేళ రోజు రోజంతా, ఆ భార్యాభర్త లిద్దరూ కూతురిపెళ్లి భోగట్టాలే మాట్లాడుకున్నారు. ఆఇద్దరికీ కట్నం, కానుకలు ఎక్కువ అక్కరలేకుండా నిక్షేపంలాంటి అల్లుడు వస్తున్నాడని సంతోష మేసింది గాని సుందరమ్మగారు మాత్రం "ఏమండీ ! మరి సంప్రదాయం అంత మంచిది కాదవీ నలుగురూ ఆడిపోసుగోరుటండీ ?" అని మధ్య మధ్య అనుమానం వెలిబుచ్చింది.

"ఏడ్చినట్లుంది .... ఈ రోజుల్లో అవేమిటో ఎవ రడుగుతారు ? నరసమ్మలాంటి ముసిలాళ్ళు తప్ప .... అన్నీ బాగుంటే సూర్యం మనకి దక్కడనుకో .... ఇంతకీ ! నా రక్తం పంచుకున్న అప్పచెల్లెలు .... దాని మొహం చూసి ఇదంతాగాని యీ వెధవసమాజం కోసరమా ?" లోకాన్నే ఎదిరిస్తున్నట్లు మాటాడేడు జయరావుగారు.

సుందరమ్మగారు ఉత్త అనుమానాలమనిషి. "మరీ, వయస్సు మూడేళ్ళ తేడా ఉంటుందండీ? చాలా ?" అన్నది.

"ఎవరన్నారు ? చాలదనీ ? .... అదీగాక మన మీనాక్షికి ఇరవై యేళ్ళకంటే యెక్కువంటే, ఎవ్వరూ నమ్మరు. ఒక్క నువ్వూ నేనూ తప్ప..."

దంపతు లావిధంగా పెళ్లిప్రయత్నాందాకా వచ్చారు. చివరికి అప్పడాలకి పప్పు ఆడించేటంత మేరకు, మాటాడుకున్నారు తెల్లవార్లూ....

## 34

కృష్ణవేణమ్మా, సావిత్రీ వండుకుని తినేసరికి మధ్యాహ్నం రెండుగంట లయ్యింది. ఈలోగా లలితాంబకి మాత్రం ఏపనీ చేతబట్టిందిగాదు.

తన కొడుకూ, తోడికోడలూ, తనకి ఈ భర్తనీ, ఈ యింటినీ యిచ్చి, ఇంత బ్రతుకు పెట్టేరన్న విశ్వాసం అవగింజంతమేర ఆమె గుండెల్లో యెక్కడవో ఉన్నది గనకనే రాజ్యలక్ష్మిని ఆమె బ్రతకనిస్తున్నది. కాని, కృష్ణవేణమ్మ మాటలతో ఆమెకి గుండెల్లో మంట పుట్టింది రాజ్యలక్ష్మిమీద పగ తీర్చుకోవాలనిపించింది.

"నువ్వు చెప్పిన మాటలు నిజమనుకునేటందుకు సాక్ష్యమేమిటి ? ఈపిల్ల దిక్కుమాలినదవుగాక .... కాని యిలాగ నమ్మడం .... ? నీకెవరు చెప్పేరు ?" అని ఆమె కృష్ణవేణమ్మను నిలదీయలేదు. కృష్ణవేణమ్మను రమ్మన్నది అసలు రాజ్యలక్ష్మిని వదిలించుకుందామనే కదా ? అదీ ఆలోచించలేదు.

ఐతే కృష్ణవేణమ్మే చెప్పింది. ఆవిడ తోడికోడలు ఒకామె 'ఉబ్బసదగ్గు'తో బాధపడుతూ ఆస్పత్రిలో ఉన్నప్పుడు సీతామహాలక్ష్మిగా రక్కడ అదే వార్డుకి దగ్గరగా ఉండేదిట.

ఒకనాడు ఒక కాపువడుచు వచ్చి ఆమె పాదాల దగ్గర కూచుని ఏడ్చింది. పది మంచాలు, ఒక అద్దాల గోడ ఇత్యాదులు అడ్డు ఉండడంనించి మాటలైతే గ్రహించలేదు గాని ఆ ముసలమ్మ సంగతి పసిగట్టింది. వచ్చిన స్త్రీ బాలెంత అన్నది స్పష్టమే. అటుతర్వాత అదే కాపువడుచు ఒక పసిపిల్లను తెచ్చి సీతామహాలక్ష్మమ్మగారికి యివ్వడంతో ముసలమ్మ సంగతిసందర్భాలు గుణించి ఈ అసలువిషయం గ్రహించిందట !

"కావాలంటే ఈ మా తోడికోడలు, దాని కొహాస్త్రుడింట్లో గడియో గంటో అని పడి ఉంది. చెబుతుంది .. "రమ్మంది" కృష్ణవేణమ్మ.

లలితాంబకి ఆ తెలివిగాని, తేటగాని లేనేలేదు. పిడికిళ్లు బిగించి చండికావతారం పూనింది. తన దగ్గర దాచి జాతిమాలినదాన్ని తనచేతులతో పెంపకం చేయించడమా ? వెలి వేయించుకుని వేరే పోక; ఆ సీతామహాలక్ష్మమ్మ ఈ పీడ తన నెత్తిన రుద్దడమా ? అంత పెంచుకుందికీ అంటే బ్రాహ్మణపిల్లలే కరువయ్యేరా దేశంలో ? అదీగాకా .... గడియో గంటో గుటుక్కుమనేవాళ్లకీ సంతానం ముచ్చటెలెందుకు ఉండాలి ? అని యిలా రకరకాలుగా తన ఈర్ష్యను ఇనుమడింపజేసుకుని భర్త రాకకి యెదురుచూడసాగిం దామె.

రాజ్యలక్ష్మి నరసమ్మగారింటినించి వాల్గు గంటలవేళ తిరిగి వచ్చింది. ఆపిల్లను చూస్తూనే లలితాంబ ఉగ్రరూపంతో ఎదుర్కొని పళ్లు ఇవతలికి బిగించి మీద పడి, బాదేసింది.

కృష్ణవేణమ్మ అడ్డుకుంది. లలితాంబ పెనుగులాడింది. చివరికి కృష్ణవేణమ్మ లలితాంబ కొప్పు పుచ్చుగుని ఒక్కసారి దూరంగా లాగి అమాంతం మనిషిని కూలదోస్తేగాని లలితాంబ అదుపులోకి రాలేదు.

"ఛీ! యేమిటదీ ? .... నీ తొందర మండా ?.... చేతులు కాలేకా ఆకులు పట్టుకుంటే యేం లాభం ? .... అయ్యో ఇలా అయితే యెలాగే, తల్లీ బ్రతుకు తొవ్వా ?" అని చివాట్లు వేయసాగింది కృష్ణవేణమ్మ.

రాజ్యలక్ష్మి వెక్కి వెక్కి యేడుస్తూండగా సావిత్రమ్మ ఆపిల్లను అవతలికి తీసికెళ్లింది.

అటుతర్వాత కృష్ణవేణమ్మ లలితాంబతో అర గంటసేపు గుసగుసలు పోయింది. అనేక మంతనాలు చేసింది. చివరికి ఆమె చెప్పింది తనకు సమ్మతమే నన్నట్టు తల వంకించింది లలితాంబ. "కడుపు చించుకుంటే కాళ్లమీదా, అని .... నా పిల్లలికికూడా ఈ పీడ తగుల్కొని తా చెడ్డ కోతి వనమల్లా చెరచింది అన్నట్టు అవుతుంది" అని వినుక్కుని లలితాంబ "నువ్వు చెప్పిందే బాగుందినుమా ?" అన్నది. "అలాగే చెయ్యాలి" అని ఓ నిర్ధారణకు వచ్చింది కూడాను.

"అలా చేస్తేనో మీ ఆయనకి బుద్ధి వస్తుంది.. నాకు కాశీయాత్రా తెమలుతుంది .... నీకో, ఓ కాసో, తులమో నగా మిగులుతుంది...."అన్నది కృష్ణవేణమ్మ.

మ్యూజియం చూడటానికి వెళ్లిన ఇద్దరు వ్యక్తులు ఒక విగ్రహం చూస్తున్నారు. దాని కింద ఒక ఫలకంమీద బి.సి. 1016 అని చెక్కి ఉంది.

ఇద్దరూ బిత్తరపోయి ఒకళ్ల మొహాలు ఒకరు చూసుకుంటున్నారు.

"ఒరేయ్! ఆ అంకె ఏమిటిరా?"

"ఏమో తెలియటం లేదురా! ఆ మనిషి బహుశా ఆ అంకె గల కారు కింద పడి చచ్చిపోయుంటాడు!"

ఎం. మునిరత్నం (కటక్)

లలితాంబ భర్తతో యుద్ధరంగం మీదికి దిగడమెలాగో వనే ఆలోచనలో పడిపోయింది.

కృష్ణవేణమ్మ, సావిత్రమ్మ కలిసి నరసమ్మగారిని చూడ వెళ్లారు. మేము ఫలాని అని వాళ్లే పరిచయం చేసుకున్నారు. మీనాక్షి చాప వేయబోగా "అయ్యో ! వెధవ ముండలం మాకెందుకే తల్లీ, చాప గీపాను" అంటూ కింద చతికిలబడ్డారు.

అదేవేళకి శంకరంగారు నరసమ్మగార్ని చూద్దామని వచ్చి కూచుని ఉన్నారు. ఈ కొత్తవాళ్లు రాగానే ఆయన లేచేరు. సూర్యం ఆయనతోటి అవతలికి నడిచేడు.

కృష్ణవేణమ్మ సానుభూతి వాక్యాలు పలికింది మొదట. "మా లలిత చెబుతుంది మీ గురించి. దేవత అంటుందంటే నమ్మండి" అన్నది పిదప. తర్వాత నరసమ్మగారితో కాస్త చనువుగానే పుంజుకుని "అయితే యిప్పుడు వెళ్లి నోతగాడు మీకు చుట్టమా ?" అన్నది.

"ఆయనా ? .... శంకరంగారట .... మా సూర్యం ఆఫీసులో పని .... మీ రెంత చుట్టాలో ఆయనా అంతే" నరసమ్మగారు ఆయాసంగా సమాధానాలు చెప్పసాగింది.

"నిర్మలన్న ఆవిడకీ మీకూ ఏమైనా దూరం చుట్టరికమా ?" సావిత్రమ్మ ప్రశ్న. నరసమ్మగారిలో వోపిక నశించింది. "అవును" అన్నది.

కొరడా దెబ్బతగిలినట్టు గతుక్కుమన్నారు ఆ యిద్దరూ. మీనాక్షి ఉదయం సూర్యం తెచ్చిన ఇంగ్లీషు వారపత్రిక తిరగేస్తూ యీ యిద్దర్నీ మధ్య మధ్య వింత జంతువులను చూసినట్టు చూడసాగింది.

"మరి యీ పిల్ల యెవరూ ?" కృష్ణవేణమ్మ అడిగింది.

"అది మా మీనాక్షి .... నాకు మనుమరాలు."

"ఆహా .... బాగా చదువుకుందా ? .... యీ రోజుల్లో చదువుండాల్లేండి .... "అంగ విన్యాసంతో సహా వ్యాఖ్యానించింది కృష్ణవేణమ్మ. మీనాక్షి యీ యిద్దర్ని "యిక వెళ్తారా ?" అన్నట్టు ఉరిమిచూసింది.

"ఇక వెడతాం తల్లీ!..." అన్నది కృష్ణవేణమ్మ. "మేమూ మా లలిత రమ్మంటే వచ్చేము. ఈ యేడాది రాజ్యలక్ష్మికి పెళ్లి నిశ్చయం చేస్తున్నాము" అంటూ లేచింది

"అలాగా ! ఎక్కడ సమ్మంధం ?" నరసమ్మగారు యెంత దాచినా కుతూహలం వ్యక్తమయింది.

"మావూరే .... మావాడే .... ఇంకా యేదీ ఖాయపడాలి .... వస్తాం .... మళ్లీ చూస్తాం ... భగవంతుడే ఉన్నాడు. దయమాత్రం ఉండాలి. మీది .... " ముసుగు సవరించుకుంటూ, కృష్ణవేణమ్మా, పయిట సవరించుకుంటూ సావిత్రమ్మా, వెళ్లిపోయేరు.

"అమ్మయ్య పీడ విరగడయ్యింది .... మిమ్మల్ని మాటాడొద్దోయని డాక్టరంటే ఆ వెధవ ముండలని పొమ్మనరేం ఖర్మ ?" అన్నది మీనాక్షి తలుపు దగ్గిరసా వేసివచ్చి.

"ఏమిటో ప్రపంచం ! ఎవరి కుతూహలం వాళ్లదే పిల్లా ?" నరసమ్మగారు నిట్టూర్చింది.

## 35

అదే సాయంత్రం ఐదుగంటలవేళ నరసమ్మగారికి గాఢమైన నిద్ర పట్టింది. నిర్మల వచ్చి ఆమె దగ్గిర కూచున్నది. మీనాక్షి నిర్మల కొక కప్పుతో కాఫీ తెచ్చి అందించింది. రెండో చేతులో ఉన్న కప్పును చూసి "యిది: అదో డాబామీద ఉన్న సూర్యంబావకి" అని డాబామీదికి ఒక్కొక్క మెట్టే ఎక్కసాగింది.

అదేవేళ సాంబశివంగారు ఇంటికి వచ్చి "ఏమేవ్ ? కాస్త మిరియాలకషాయం పెడతావ్ .... పడిశం పట్టింది" అంటూ కేకేసేరు భార్యని.

అంతలో కృష్ణవేణమ్మ, సావిత్రీ యిద్దరూ నిరంజనంగారి వాటాలోంచి అడావుడిగా వచ్చి

# విడి విడని చిక్కులు

"రాం బాబూ కులాసా" అంటూ పలకరించేరు.

"ఆఁ .... ఆఁ .... కులాసావే దేవుడి దయవల్ల.... మీ రెప్పుడు వచ్చేరు ? .... అంతా క్షేమమేనా ?". బసను విప్పుకుంటూ కుశల ప్రశ్నలు వేసేరు సాంబశివంగారు.

"ఏదో ఆ ఏడుకొండలవాడి దయవల్ల అంతా క్షేమమే ! .... ముప్పు ముందు భోజనపానాదులు కానీ బాబూ అంటూ ఆ ఇద్దరూ తప్పుకున్నారు.

కృష్ణవేణమ్మ, లలితాంబని పిలిచి "ఏమోనేవ్, ఏలా కదులుతావ్ ? ఈ బజారు మొగని "శకుని విజయం" సినిమా ఉందంటవిగా .... నేమా సావిత్రి పోయొస్తాం .... సరేనా ?" .... అన్నది.

"వెళ్ళ నీ కెందుకూ ? .... నే నెంత మంచి దాన్నో .... అంత చెడ్డదాన్ని కూడాను" అని భర్తను ఏవిధంగా తాను నిలదీసేది కళ్లతో చూపించింది లలితాంబ.

సాంబశివంగారు భోజనానికి కూచుంటూ "పిల్లు యిప్పుడు ఏదేనా పనిమీద వచ్చేరా?" అనడిగేరు.

లలితాంబకి ఉక్రోషంతోనూ, ఒళ్ళు మంటతోనూ మాటంకు నాలిక తిరిగింది కాదు.

"లేదు .... మంచి పనిమీద వచ్చేరు. .... మీ మునిగిపాటం బయటపెట్టి .... కాకి రెక్కతో జల కడిగి అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు గంగలో కలిపి .... పుట్టగతుల్లేవని చెబుదామనే వచ్చేరు. ...." అన్నది.

ఆమె ముక్కుల వెంట మంటలే వస్తున్నాయి. గరిటె గిన్నెకేసి కొట్టినప్పుడు ఇత్తడి గిన్నెమో ? అవతలి వరండాలోని పిల్లి బెదిరి పారిపోయింది. సాంబశివంగారికి ముద్ద గొంతుకలోకి దిగలేదు. గుండెల్లో మున్నూరు గుభేలు గుబేలుమంది.

"కళ్ళు మూసుకొని పిల్లి పాలుతాగుతుందిట ! అలాగా .... ఏదో వెర్రిబాగులదాన్ని నన్ను ముంచ గల్గుపనే .... లోకం కళ్ళుగప్పడం మాటలా ? ముజాకాలా ...." కొంగుతో ముక్కు మలుపుగొని కళ్లనిండా నీళ్ళు పెట్టుకుంది లలితాంబ.

"అయ్యో దేవుడా ! యేం కొంప మునిగిందేం? సాసిప్పగేం ...." సాంబశివంగారు అవపోశన పట్టబోయేరు. గభిక్కున భర్త చెయ్యి పట్టుకుంది. "నన్ను చంపండి .... నా పిల్లలమీద ఒట్టు. ఇవాళ ఒకపూట సిద్ధాన్నం కాళ్లదన్నుకుంటే మూసే ముప్పకా దిది ...."—వారించింది.

సాంబశివంగారికి కొంచెం కొంచెం అర్థమయ్యింది. రానున్న దనుకున్న ఉపద్రవం రానే వచ్చింది అన్నట్లు ఆయన నిట్టూర్చేడు.

లలితాంబ ఏడుస్తూనే వడ్డన సాగించింది. "అది ఏ జాతిమాలినకడుపుని పుట్టిందో ..ఇన్నాళ్లు పెంచేను .... ఇవాళ లోకమంతా గడియో, గంటో గుప్పుమంటుంది. .... నేను భూదేవిలాగ కడుపున పెట్టుకున్నా, నా పిల్లలికి కూడా బ్రాహ్మణ పంచను నిలువ నీడదొరకదు ...."

"లలితా !" అతని కంఠం జీరవోయింది. కన్నీళ్లు లేవుగాని ఆవేగనక వస్తే కట్టలుండ వన్నంత బరువుగా ఉన్నా యతగాడి కళ్లు "నన్ను క్షమించు లలితా ! .... నిన్ను అన్యాయం చేద్దామని కాదు నా ఉద్దేశ్యం .... కడుపు చించుగుంటే కాళ్లమీద పడుతుం దంటారు .... ఇక నాలుగ వాళ్లలో దానికా మూడు ముళ్ళు వేయిస్తే ...."

సాంబశివంగారి అనునయధోరణికి మరింత రెచ్చిపోయింది లలితాంబ.

"ఇంకా పడడం గిడడం యేమిటి. రోడ్డుమీద పడ్డాం....ఏమొహం పెట్టుకుని ఎవర్నేనా సమ్మంధం అడుగుతాం .... ఈ జాతిభ్రష్టుం కొంప కే సిగ్గుమాలినవాళ్ళు వస్తారు?

అంతలో ఆ ఎంగిలిచేత్తోనే సాంబశివంగారు భార్య వేళ్ళు పట్టుగున్నాడు.

"ఇష్ ! .... నీ పెద్దలకు దండం పెడతా .... కేకలెయ్యకు .... పిల్లది వింటుంది ...." అని బ్రతిమాలుకున్నాడు.

"అయ్యో ! అయ్యో ! అవేం మాటలు .... తప్పు తప్పు. నా చేతులు వదలండి" .... అని చేతులు విదిలించుకుని వెక్కిళ్ళు గుక్కిళ్ళు ఏడవసాగింది. లలితాంబ.

సాంబశివంగారికి పెదవులు విడి మాటలు పెగల్లేదు.

"నే నెప్పుడో చెబితిని .... మా మేనమామ మరిది సమ్మంధం గురించి .... అతగాడికేం తక్కువని? .... అయితే ఏం లాభం .... నా కొంపకి ఎసరు పెడితేనేగాని మీకు కడుపు నిండింది గాదు" .... లలితాంబ సాధింపులు సావకాశంగా మొదలెట్టింది.

"చూస్తూ చూస్తూ రెండోపెళ్లి ముసిలాడికి ఇమ్మంటావు ? ...." సాంబశివంగారు దుఃఖంలో కూడా మండిపడ్డాడు.

"లేదు .... పదహారేళ్ల బాలాకుమారు డొకణ్ణి తెద్దాం ...." వెటకారం చేసింది లలితాంబ .... "ఇవాళ రెండోపెళ్లివాడి దాకా యెందుకు? .... పదోపెళ్లివాడుకూడా మీ గడప తొక్కడు .... మా కృష్ణవేణి పిన్ని అనతే చెడ్డది. ఈపాటికే లోగిలి లోగిలంతా ముట్టించి ఉంటుంది"

ఆమె మాట లొక్కొక్కటి ఒక్కొక్క పిడుగులా పడ్డా యతగాడిమీద.

లలితాంబకి భర్త మాట్లాడకపోవటం ఒళ్ళు మండించింది.

"ఇంతకీ నా పిల్లలికి చుట్టుకుంది ఇది .... సిగ్గుమాలినది గాపోతే మా వదినెకి పెంచుకుందికి మాలపిల్లే దొరకాలా ?" అన్నది.

"లేదు లలితా ? ఒదిన్నేమీ అనకు. వదినె దేవత"

"దేవ్ .... వతా ?" .... యెక్కెక్కెక్కంగా మూతి తిప్పింది లలితాంబ.

మళ్లీ చెప్పింది. "ఇంక ఈ గుండెలమీద కుంపటి నాతరంకాదు భరించడం. మీరూ, మీరూ ఉరెట్టుకు చావండి .... నా పిల్లలితో నా పుట్టింటికి పోతా ...." అని రెండు క్షణా లాగి .. "అలా పోయినా ఈ అప్రదిష్ట తప్పదుగదా ?" అన్నది నిస్పృహ ప్రదర్శించి.

"ఇప్పు డేమి వచ్చింది ? వెధవపీడ నువ్వు ఉరెట్టుగోడమే గాని ...." అంటూ సాంబశివంగారు వాకిట్లోకి వెళ్లేరు.

మొండిధైర్యంతో దుఃఖం ఉగ్గబట్టుకుని భార్యను ఎదిరిద్దా మనుకున్నా డాయన.

"అదో .... ఆ ఇద్దరు వెధవ ముండలు రాలి వ్వండి .... తెలుస్తుంది ...." కసిగా యింగిత ఎత్తడంలో మునిగిపోయింది లలితాంబ.

ఆవిధంగా సాంబశివంగారి గుండెల్లో భయాందోళనలకి నాంది పలికి అప్పటికి ఊరుకుంది లలితాంబ.

"ఇక ఈవిజం దాగదు. చెబుతా చెప్పి తీరుతా .... చెప్పినతర్వాతనైనా దీనికి జాలి కలుగదా ? అని తలపోశా డాయన. ఐతే లలితాంబ తిరిగి తాంబూలం పట్టుగొని సాధిస్తూ వచ్చేసరికి తాను చెప్పదలుచుకొన్నది నిజం చెప్పుకోలేకపోగా, దీనంగా భార్యని బ్రతిమాలసాగాడు.

"నీ పుణ్యం ఉంటుంది .... ఈ ముసిలాళ్ళు ఏమన్నారో చెబుదూ" అని అడగడమే తడవు. మళ్లీ విజృంభించింది లలితాంబ.

"ఈపిల్ల కావలదన్నారు .... అట్టే మాటాడితే మాలదన్నారు. వెరో వండా పారేసి వోరు వాక్కొద్దా మనుకున్నాను గాని ...."

సాంబశివంగారికి కొండందుకున్నంత సంతోష మయింది.

"నిజంగానే ? .... సరే అలాగే చేద్దాం."

"అబ్బ ! ఎంత సిగ్గుమాలినతనం. పీళ్ల నోరు నొక్కుతాం సరే .... ఈ పీడని మన మెక్కడ భరిస్తాం .... అంచేత నామాట వినండి .... ఆ సమ్మంధంకూడా కుదర్చమంటాను ..... నాలు గొందలు పారేస్తేరా .... యీ ముండ లిద్దరూ, కాశీకి పోతారు . .. అది వెయ్యిరూపాయలతో నాపీ కెలమించి పోతుంది .... ఏ మంటారు ? .. ." లలితాంబ ఆప్యాయంగా, అనునయంగా భర్త గుండెలమీద చెయ్యి వేసింది.

కాల్చిన యినపకమ్మిలాగ ఉందామె అరచెయ్యి స్పర్శ.

అటుకేసి తిరిగిపోయారు సాంబశివంగారు.

"తెల్లారేలోగా ఆలోచించుకోండి" హెచ్చరించింది లలితాంబ.

(సశేషం)

---

పరీక్షకు చదుతున్న ఒక విద్యార్థి, వెనుకటి పరీక్షాపత్రాలలో కొన్ని ప్రశ్నలు ఏటా వస్తూండటం చూసి లెక్చరర్ని అడిగాడు.

"అవునయ్యా ! ప్రశ్న లెప్పుడూ ఒకేరకంగా ఇస్తాం. ఏటేటా సమాధానాలుమాత్రం మారుతుంటాయి" లెక్చరర్ అతడి సందేహం తీర్చాడు.

ఆర్. శకుంతల (నాస్త్రేయ)

---

## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

# PHILLIPS ఫిలిప్స్ సైకిళ్ళు

## మీకై నిర్మితమైనవి

సొగసై కంటికి నదరైన ఫిలిప్స్ సైకిలు నేటి మీవంటి వుత్సాహవంతులైన యువకుల కొరకై నిర్మితమైనది. ఎట్టి మోటు వాడుకకైనను తట్టుకొన జాలు నట్లుగా అనలైన పదును చేయబడిన ఉక్కుతో దృఢముగా నిర్మింపబడినది.

డెబ్బై ఏండ్లుగా ప్రపంచ ఖ్యాతి నొందిన ఫిలిప్స్ సైకిళ్ళు, యిప్పుడు టి. ఐ. సైకిల్స్ వారి అత్యాధునికమైన కర్మాగారంలో, ఖచ్చితమైన పద్ధతులలో తయారుచేయ బడుచున్నవి.




టి. ఐ. సైకిల్స్ అఫ్ ఇండియా అంబత్తూరు – మద్రాసు

JWT-TIC PH 1603

# ఆరతి

13-వ పేజీ తరువాయి

సంగీతాన్ని మేళవించి తీసిన చిత్రం రాజశ్రీవారి 'ఆరతి'. ఇటీవల మద్రాసు స్టార్ టాకీసులో విడుదలయింది.

డాక్టరు చదువుకున్న ఆరతి (మీనాకుమారి) తోటి డాక్టర్ ప్రకాశ్ (అశోక్‌కుమార్) ప్రేమ హారతులను నిర్దాక్షిణ్యంగా ఆర్పేసి, పుట్టెడు సంసారంతో అష్టకష్టాలు అనుభవిస్తున్న దీపక్ (ప్రదీప్ కుమార్)ను ప్రేమించి పెళ్ళిచేసుకొంటుంది. నోటి దురుసు జాస్తిగావున్న తోటికోడలి (శశికళ) లగాయతు, రోగగ్రస్తుడయినఆమె పుత్రునివరకు అందరి మన్ననలూ చూరగొంటూ, నరకప్రాయంగావున్న ఆ సంసారాన్ని స్వర్గమయం చేస్తుంది. పాత స్నేహాన్ని మరచిపోలేని ప్రకాశ్ ఆమె ఇంటికి రాకపోకలు సాగిస్తూ, ఏదో నెపంతో అప్యాయంగా, ఆశగా మాట్లాడుతూంటాడు. ఇదంతా కిటికీల్లోంచిచూసి దారుణంగా అపోహపడి, సర్దుకొని లేవబోతూండగా వదినగారువచ్చి అపోహ నిజమేనని ధృవపరచడంతో దీపక్ భార్యమీద ఆగ్రహించి ఇంటినుంచి వెళ్ళగొడతాడు భార్యాలేక, మనశ్శాంతిలేక, బొంబాయి రోడ్ల మధ్యగా నడుస్తూ, కారుక్రిందపడతాడు. తలకు ఆపరేషన్ చేయవలసివస్తుంది అది కూడా ప్రకాశ్ మాత్రమే చేయాలని (దర్శకుడు, కథకుడు కూడ బలుక్కొని) ఆదేశిస్తారు దీపక్ బతికినా, చనిపోయినా ఆరతి తనను వరిస్తే ఆపరేషన్ చేస్తానని ప్రకాశ్ షరతు పెడతాడు పొంగివస్తున్న దుఃఖాన్ని భారంగా దిగమింగి సరేనంటుంది ఆరతి ఆపరేషన్ విజయవంతంగా ముగిసినతర్వాత ఆరతి ప్రకాశ్ సమక్షంలో నించొని, విషం సీసాను క్లోజప్‌లోఎత్తి చూపించి వెంటనే ప్రకాశ్ దానిని లాక్కొని అవతల పారేస్తాడు తనను వరించిన మరొక చిన్నదానిని (అతనికోసం అక్కడే వేచియుంటుంది) తీసుకొని శూన్యంలోకి భారంగా అడుగులు వేస్తూ పోతాడు కథను సుఖాంతం చేస్తాడు

ఈ కథ క్లుప్తంగా ఇదేఅయినా మధ్యలో మలుపులు చాలా ఉన్నాయి మధ్యలో మహమూద్ విజయచౌదరి, రాజేంద్రనాథ్‌ల ప్రేమాయణం కొద్దిగా నవ్విస్తుంది మీనాకుమారి ఇటువంటి పాత్రలు సునాయాసంగా నటించివేస్తుంది 'పద్మశ్రీ' అశోక్‌కుమార్ ఈ తరహా పాత్రకు తగడనిపించింది అందరికంటే చెప్పుకోదగిన నటన శశికళది చాలా బాగా నటించింది ఈ చిత్రంలో సంగీతం ప్రత్యేకాకర్షణ రోషన్) రఫీ పాడిన 'అబ్ క్యా మిసాల్ దూఁ' అనే పాట హృదయానికి హత్తుకునేలా హాయిగావుంది 'ఆప్‌నే యాద్ దిలాయా' (లతా, రఫీ), 'కభీతో మిలేగీ' లతా) అనే పాటలు సుమధురంగా ఉన్నాయి ఛాయాగ్రహణం (పాండురంగ నాయక్) చాలాసహజంగా ఉన్నది గుజరాతి నాటిక 'సంస్కారలక్ష్మి' ఆధారంగా తీసిన ఈ చిత్రానికి ఫణిమజుందార్ దర్శకత్వం-హాయిగొలిపే సంగీతానికి మీనాకుమారి శశికళల నటనకు తప్పక చూడవలసిన చిత్రం 'ఆరతి.'



—'ఎన్నారి'

# ఉత్కృష్టమైన

అత్యాకర్షకమైన
స్టెయిన్‌లెస్
స్టీల్ పాత్ర సామానులు
—మీరు కోరునవన్నీ గలవు.




మీరు కొని ఈ క్రింది ప్రతి ఓకే తయారీ వస్తువునుంచిన్నీ బహుమాన కూపనులను చేర్చిపెట్ట ప్రారంభించండి:

- ఓ.కే. వనస్పతి
- ఓ.కే. డబుల్ రిఫైన్డ్ అయిల్
- గోల్డన్ సలడ్ ఆయిల్
- ఓ.కే. చందన సబ్బు
- ఓ.కే. ఓరియంటల్ రోజ్ సబ్బు
- ఓ.కే. నీమ్ సబ్బు
- మియోకే సబ్బు
- సోప్‌చిప్పు

మరిన్నీ ఆ మీ కూపనులకు మారుగా అత్యాకర్షణీయములగు స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలను — మీకు ఇష్టమైన పరిమాణ ప్రమాణాలలో — మీకు అతి సమీపమునగల ఓ.కే. వ్యాపారి వద్దనుండి పొందండి.

ఈ ప్రత్యేక బహుమానయోజనల గురించిన విశేష వివరాలు గల పచిత్ర ఫోల్డరుగురించి మీ ఓ. కే. వ్యాపారిని అడిగి పొందండి.







EP. EAC. 27 TEL

*తయారుచేసినవారు:*

**ది ఈస్ట్ ఏష్యాటిక్ కం. (ఇండియా) ప్రైవేట్ లిడ్., మదరాసు-1**

వింతో ప్రయత్నించింది అందర్నీ అర్థించింది, ప్రార్థించింది ఎట్‌లీస్ట్—హీరోయిన్ వేషమయినా యిమ్మంది. హీరో అయినా ఇవ్వం పొమ్మన్నారు. కొన్నాళ్లకు నాబోటి సలహాలరాయుడు — సారీ, మీబోటి అనుకుందాం, ఎచ్చాడు వచ్చి 'అసలంతా మీ పేరులో ఉంది అది మార్చుకుంటే సరి పేరులో ఆకర్షణలేదు షీలా ఏమిటి—షీలా—అంత కన్నా 'ఉప్పు' అన్నమాట గొప్పదన్నమాట. అందు వల్ల మీరేం చెయ్యాలన్నమాటా, పేరు మార్చు కోవాలన్నమాట. మీపేరు గుమ్ గుమ్ ఇట్లా మార్చండి, గుమ్మగా ఉంది. ప్రొడ్యూసర్లు తెల్లవారేసరికి ఆరుమైళ్ల క్యూలో ఉంటారు'' అని సలహా చెప్పాడు పైగా—''నూరు రూపాయల విలువైన సలహా చెప్పాను కనీసం యాభై అయినా ఇవ్వండి'' అని ముప్పై రూపాయలు పట్టుకు పోయాడు తెల్లవారి లేస్తూనే గుమ్ గుమ్ గుమ్మం లోకి వెళ్లి చూసింది ఆరంగుళాల పొడవున చీమల బారు వరుసగా వాళ్లింట్లోకి ప్రవేశిస్తోందితప్ప ఇంకే క్యూ లేదు గూలేదు. ఆతర్వాత తానే క్యూలలో నించుని ప్రొడ్యూసర్లనూ, డైరెక్టర్లనూ చూసింది ఈపేరు కాదంది — గగన్‌రాణి అని మార్చింది ఉహూఁ! తర్వాత మళ్లీ మార్చింది, మళ్లీ మార్చింది. ఎన్ని చేసినా ఎన్ని పేర్లు మార్చినా—ఛాన్సు రాలేదు 'ఛా! పేరులో ఏంలేదు నాకు అదృష్టం లేదు పేరేం చేసేందిలే, అనవసరంగా మార్చుకొంటినే'' అని గదిలో కూచుని, గాలివానలో, అద్దాల కిటికీలోంచి చూస్తూ మెరుపులు మెరుస్తూ ఉండగా దాంతో శృతికలిపి భోరున పాడింది అట్లాగా, అంతమాత్రాన ఏముందిలెండి ఐనా మీరు ఉచితంగానేగా సలహా యిస్తే కానీ ఖర్చుకాని భాగోతం, పదండి'' అని లేచాడు రత్నా ముగ్గురం కలిసి హీరోయిన్ యింటికి దారితీశాము.

''సరేలెండి హీరోయిన్‌ను బుక్‌చేశారు'' అని పూర్తిచేశాడు, కుమారరత్నం.

''ఉండు నాయినా—ట్రీట్‌మెంటు ఒక్కముక్కలో చెప్పేస్తే రసం రసాభాస ఐపోదూ!'' అన్నాడు మహాశయుడు.

''ఏమిటో, 'డ్రాగ్' కొడుతోంది. మీకు కథ చెప్పటం తెలీదు. ఈపాటికల్లా ఇంటర్వెల్ వచ్చేయాలి. చెబితే తొందరగా చెప్పండి. లేకపోతే వాది వాశిచ్చేయండి'' అన్నాడు కుమారరత్నం.

''ఉండ్రా నాయనా — చెబుతున్నారుగా చెప్పని. ఏమీ కొట్టదు. బావుంది చెప్పు మహాశయా!''

''ఏం—ఏం చెబుతున్నానూ—విశ్వాస్ అన్నీ నాకో స్నేహితుడు ....''

''అదంతా ఐపోయిందయ్యా—మీరంతా కలిసి హీరోయిన్ యింటికెళ్లారు.''

''ఆఁ, హీరోయిన్ యింటికెళ్లాం గదూ! ఆమె నొద్దతార. మా అందరికంటె వయస్సులోకూడా పెద్ద అనే నా నమ్మకం. అన్నీ మాట్లాడుకున్నాం. అడ్వాన్సు యిచ్చాం. ఆమె ఒప్పుకుంది ఐందా—లెండి పోదాం అంటే ఆ రత్నా కదలడే! రావం

# చిత్రలాభము

15-వ పేజీ తరువాయి

టాడు ఆమెలేని నా జీవితం వృధా వృధా అంటాడు అట్లా పాడుకోటానికి వీలుగా ఆమె పేరును సుధ' అని మార్చుకోమంటాడు.

'రత్నాగారూ, ముందుంది ముసళ్లపండుగ—కాస్త పరిచయం కానీండి — ఆమే మీచుట్టూ తిరుగుతుంది. అని ఏవేవో చెప్పి లేవనెత్తి, కార్లో కుదేశాం దారంతా రత్నాగారు ఆమెకోసమే పరితపించాడు.

''మీరిలా డీలా పడిపోకూడదు రత్నాగారూ.''

''డీలా ఎక్కడపడ్డాను పోవయ్యా, మూడంకెలా పడి చుట్టుకుపోతూ ఉంటేనూ'' అని కసురుకున్నాడు రత్నా.

రత్నాలు ఆపూట భోజనం మానేశాడు ''నన్నొక్కసారి ... హాఁ .. నా భాగ్యదేవతతో ... హాఁ .... మాట్లాడనివ్వరూ .. హాఁ .. ఇంక నేను హాఁ .... బ్రతు . హాఁ . కను . . హాఁ ....'' అంటూ మూలగసాగాడు

''మూలగరాదు రత్నా — చెబుతూఉన్నది నీకే'' అని గర్జించాడు విశ్వాస్, టేబిల్‌మీది కత్తి తీసి అతనికి చూపుతూ, రత్నాలు 'ఆఁ' అని లేచాడు—''ఎబ్బే . .. నేనా మూలిగింది! ఎవడన్నాడా మాట ? .... నే నెందుకు మూలుగుతానూ!'' అన్నాడు మామూలుగానే

''ఆఁ అదీ వరస కూర్చోండి ఆవేశ రావాలి. అప్పుడు మూలుగుదురుగాని'' అన్నాడు విశ్వాస్.

రత్నా ఏమనుకున్నాడోగాని— ''నేను సినిమా తియ్యను.'' అన్నాడు ఛట్కున

''ఆఁ'' అని ఇద్దరమూ ఒకరిమొహాలు ఒకరం చూసుకున్నాము.''

''మీరు నన్ను హత్య చేస్తారు—ఆసంగతి నాకు తెలుసు. వెనకటికి ఇట్లాగే కొందరు నమ్మించి ఒకతన్ని హత్యచెయ్యబోయారు మీ కాకథ సవిస్తరంగా చెబుతాను వినండి.

అప్పటికి సినిమాలూ, నేనూ పుట్టలేదు. ఈకథ మా తాతగారు, మా తండ్రిగారికి చెప్పగా, మా తండ్రిగారు వారి స్నేహితునితో చెప్పగా చాటుగా నేను విన్న కథ. నాటకాలలో బాగా పేరు తెచ్చుకున్న ఒక బెంగాలీ మనిషికి ఒక ఊళ్లో సన్మానం ఏర్పాటుచేశారు. చిన్న నటులూ, కాస్త పెద్ద వేషాలు వేస్తున్నవాళ్లూ, పేరులోకి వస్తున్నవాళ్లూ—వీళ్లంతా ఆ సన్మాన సంఘ సభ్యులు. పెద్దనటుడిని ఊరేగించారు బహిరంగసభలో నిలబెట్టి మాట్లాడించారు పత్రాలు చదివారు. దండలు వేశారు. పదిమందీ ఒక రకంగానే పొగిడారు రాత్రి పెద్ద విందు ఆ విందుకు వీళ్లంతా వచ్చారు. అసలు విషయం అక్కడబయటపెట్టారు. ''అబ్బాయ్, పెద్దనటుడూ—నువ్వు బాగా ఆర్జించేస్తున్నావు—పేరు తెచ్చేసుకుంటున్నావు. ఆపన్లు ఇంక నువ్వాపాలి. మాకు ఛాన్సులు రావటంలేదు. అందరికీ నువ్వే దేవుడవయ్యావు నువ్వు నటించటమన్నామానుకో—లేదా మా చేతుల్లోనన్నాచావు'' అన్నారు పెద్దనటుడు రవంతేనా భయపడక, ''నటనకు ఉద్వాసన చెప్పటంకంటే, మీచేతుల్లో చావటం మేలు'' అన్నాడు.

''ఐతే విషపుగ్లాసు తీసుకురండి'' అన్నారు వాళ్ళు. అందరికీ పాలు తీసుకొచ్చారు. విషం కలిపిన పాలు పెద్దనటుడి కిచ్చారు, తాగమని. ''అబ్బాయ్‌లూ, ఇది నిజంగా విషం కలిపినపాలే! ఆ సంగతి మీకు బాగా తెలుసునా! అస లెవరయినా రుచిచూపి నా కివ్వరాదూ!''

''నువ్వే చూసుకో'' అని నవ్వారు వాళ్లంతా.

''మీరంతా తాగరూ?'' అని అడిగాడు.

''తర్వాత తాగుతాం—నీ చావు చూసి''

టేబిలునిండా వాళ్ల గ్లాసులున్నాయి. పెద్ద నటుడి గ్లాసు అతని చేతిలోవుంది. అతను ఇట్లా చెప్పటం ప్రారంభించాడు ''నా జీవితంఅంతా నట



తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది!

నాకే అంకితంచేసుకున్నాను భగవంతుని కృపవల్ల మంచిపేరు తెచ్చుకున్నాను" అని ఆగి, "ఎవరది?" అని పైకి చూశాడు. అందరూ పైకి చూశారు—ఒక్కసారిగా. పెద్ద నటుడు వెంటనే తన గ్లాసు ఆ గ్లాసులమధ్య పెట్టేసి, మరోగ్లాసు తీసుకున్నాడు. ఈ సంగతి ఎవరికీ తెలీదు. "భగవంతుడు నన్ను ఆశీర్వదిస్తున్నాడు....." అన్నాడతడు పైకి చూస్తూ "నాలాగే వీళ్లందరినీ కూడా పెద్దనటుల్ని చెయ్యి" అని గ్లాసు నోటపెట్టుకుని, నిదానంగా పాలు త్రాగి, ప్రాణం విడిచేముందు కొట్టుకున్నట్టు కొట్టుకుని, కుర్చీలో పడిపోయాడు "చచ్చాడ్రా" అన్నారంతా

"తీసుకెళ్లి వాళ్లింట్లో పారేయండి" అన్నారు. కొందరు అతన్ని మోసుకునివెళ్ళి కార్లో పడేశారు. కారు వాళ్లఇంటికి జేరింది. అతన్ని గుమ్మంలో పడేసి వాళ్ళు తిరిగి వెళ్ళిపోయారు. ఆవెంటనే ఆ పెద్దనటుడు లేచి, పోలీసువాళ్లకు ఫోనించి—వాళ్లను రావించి—వీళ్లను పట్టించాడు. దీనివీతి ఏమన—పరులకు హానిచేయగోరువారు తామే చెడిపోవుదురు. అందువలన ఓలలనా—సారీ, మగవార్లా—నన్నేమన్నా చెయ్యబోతే మీకే ఎదురు తిరుగుతుంది!" అన్నాడు రత్నా.

"ఊరికేనండీ—మీరు బలేవారే—చిన్నసిప్పెన్సు .. అంతే" అన్నాడు విశ్వాస్

"ఐనా నేను సినిమా తియ్యను" అన్నాడు రత్నా

"చాలు పోదురూ బోడిబడాయి మీరూ మీ హాశ్యాలూ, కట్టిపెడుదురూ, ఊరికే" అన్నాను నేను

"హాస్యంకాదోయ్, సత్యం. హాస్యం ఆడడానికి నేనేం బావమరిదినా, కవీవం కన్నతండ్రినా"

"ఐతే మీరు తియ్యరా?" అన్నాము ఇద్దరమూ యుగళగీతంలా.

"తీస్తాను కాని.....నా....ప్రేమదేవత భాగ్యరాశి, ఆరాధ్యదైవం..... వెన్నెలపులుగు..... కమ్మలపంట...

ఈడూ జోడూ కోయిల, కాకి, పురుగు.. ." అంటూ వర్ణించుకుపోసాగాడు రత్నా

"ఆపండి రత్నగారూ—అర్థమైంది. ఆమెను మీకు కట్టబెట్టే ఏర్పాటు మాది. ముహూర్తం వచ్చేదాకానన్నా ఆగండి" అన్నాను.

"తారా ..... ప్రేమసితారా ...... నీకోసమయినా సినిమా తీస్తాను. వీళ్లకోసంకాకపోయినా నాకోసం కాకపోయినా, అని "ఏమంటారు?" అన్నాడు మామూలు ధోరణిలో.

"ఏమీ అనం. చప్పున తీయించండి"

"మరి కథో?.... .చూడండి ...... కథనిండా పాటలూ, మాటలూ, డాన్సులూ, డాన్సుప్లాట్సూ మూజిక్కూ ఇవన్నీ ఉండాలి. సినిమాఅంతా నాతారే ఉండాలి. రేప్పొద్దున్నేరండి.కథరాసివుంచుతా"అన్నాడు మే మిద్దరంలేచి బయటపడ్డాం.

"వీడు సినిమా తియ్యడు. నాది పూచీ" అన్నాను.

"నీ మొహం ఊరుకోవయ్యా—వాడే తీస్తాడు" అన్నాడు విశ్వాస్.

పొద్దున్నే లేచి వెళ్ళి 'గుడ్‌మార్నింగ్' అన్నాం.

"వచ్చారా రండి.... ఇదిగో కథ" అని పాతిక కాయితాలు మాముందు పారేసి, బాతురూముకు పోయాడు. విశ్వాస్ కథ అంతా చదివి — "భలే ఘట్టం—తెలివైనవాడే ఎటొచ్చీ తారాపిచ్చి. మంచి కథేరాశాడు కొంపదీసి హిట్టయేట్టుంది!"అన్నాడు.

"రత్నాగారు తెలివైనవారుకాదని ఎవరన్నారు?" అన్నాను నేను వస్తున్న రత్నానుచూసి

"ఏం గురువులూ, ఎట్లావుంది కథ?" అన్నాడు రత్నా.

"మోత. ఐదేసి వందలరోజులు ఆడాలి"

"తారను బుక్‌చేసి, షూటింగ్ చెయ్యండి—డబ్బులిస్తాను" అని రత్నా లేచాడు. ఇక్కడ స్టోరీని కాస్త 'స్కిప్' చేస్తాను—లేదా డిసాల్వ్ చేస్తాను.



ఎంచేతంటే, ఎండింగ్ వచ్చేస్తోందికదూ—డిటెయిల్స్ తగ్గాలి" అన్నాడు మహాశయుడు.

"తొందరగా కానీండి బరువైన సీను వెనక ఆస్పెంలా ఇదో గోల" అన్నాడు కుమారరత్నం.

"సినిమా తయారైంది—నేనే డైరక్టు చేశాను. అంటే నా పేరు వేశారు. అంతా వాళ్లే చేశారు. 'వాళ్లే' ఎవరూ—ఆమే—తారామణే. ఆమె ఆడించినట్టల్లా రత్నా ఆడాడు—రత్నా ఆటకు విశ్వాస్ తాళం వేశాడు—నేను తలూపాను. నాపేరు పాడవుతుంది ఒద్దన్నాను.

'నీ తలకాయ—ఫస్టు పిక్చరు ఫ్లాప్‌కాక ఇంకేమవుతుంది—వెయ్యని' అని విశ్వాస్ నాపేరు వేయించాడు. ఆ చిత్రరాజం విడుదలయిన రెండోరోజున ఒక ఊళ్లో తెర చింపారు—ఇంకో ఊళ్లో థియేటరువాళ్లను తంతామన్నారు. మొత్తానికి ప్రతిదినోత్సవం సల్పుకున్న చిత్రం అది. మీరు తెలుసుకోవలసిన నీతులు చాలా ఉన్నై. ముఖ్యమైనది—తార మోహంలోపడి, కథ మీరే రాయరాదు" అన్నాడు మహాశయుడు

"ఐతే, ఇంతకూ రత్నాకు తార దక్కిందా? వారిద్దరికీ వివాహం ఐందా? రత్నా ఏమవుతాడు?" అని ప్రశ్నించాడు ధనవంతుడు.

"తార చిత్రం పూర్తిచేసి, తన డబ్బు చక్కా తీసుకుని, గోహోవిందామని ఆఖరికి ప్రొడక్షన్ అతన్ని పెళ్లి చేసుకుంది. ఆఖరికి అతనూ హీరో రత్నా పిచ్చెత్తుతాడనుకున్నాం. కాని ఎత్తలేదు—'దంపినమ్మకు బొక్కిందే కూలి' అని ఖర్చుకాగా మిగిలిన డబ్బులుపెట్టి సైకిలుషాపు పెట్టుకున్నాడు. చిత్రం పూర్తయేసరికి—ఒక డొక్కుకారూ, అక్షరాలు రాలిపోయినకంపెనీబోర్డూ—ఒకబొక్కకుర్చీ—మిగిలాయి. వీటితోపాటు కొందరు మనుషుల్తో పరిచయం. ఖాళీ ఫిల్ముడబ్బాలో రెండూ, తార మరిచిపోయిన చిత్రంలోని చీరా—అప్పులుచేసే విధానమూ, అప్పులాళ్లను తిప్పేవిధానమూ, లేనిదానికి కొంత ఫోజూ, సినిమాపాటలపుస్తకం ఒకటీ—ఆర్నెల్ల అప్పూ మొదలైనవి లాభించాయి. ఈ లాభములనే 'చిత్రలాభము'లని పెద్దలందురు" అని ఊపిరి పీల్చాడు మహాశయుడు. ధనవంతుడు కాఫీ తెప్పించాడు కుమారరత్నం తండ్రిచాటున సిగరెట్టు కాల్చడానికన్నీ మంచినీళ్లమిషతో బయటకు వెళ్ళాడు.

★



# మనమూ-మనదేహస్థితి

11-వ పేజీ తరువాయి

క్లోరిక్ ఏసిడ్ ఉనికి' అని అర్థము. నాగరికత అధికమైనకొద్దీ ఉనికికై సంఘరణ ఆందోళన అధికమైనకొద్దీ, ఉద్రేక కారణములు అధికమైనకొద్దీ జఠరాశయంలో అత్యధికామ్ల స్యందనము ఎక్కువై అజీర్ణానికీ, అల్సరు ఏర్పడడానికీ కారణ మవుతున్నవి. ఆ విషయం మళ్లీ విపులంగా చర్చిస్తాను.

కొందరిలో ఏసిడ్ అధికంగా ఉత్పత్తి అయితే మరి కొందరిలో చాలా అల్పంగా ఉత్పత్తి కావడమూ కద్దు. ఈ అల్పామ్లస్థితిని హైపోక్లోర్ హైడ్రియా (Hypochlorhydria) అంటారు. హైపో అంటే అల్పమైన అని అర్థము. ఈ స్థితి ఒక్కొక్క వయస్సులో ఒక్కొక్కలాగా ఉంటుంది. వయస్సు అధికమైనకొద్దీ శాతంగా చాలా మందిలో ఈ పరిస్థితి అధికంగా ఏర్పడుతుంది. 40 సంవత్సరములు దాటినతరువాత ఈ స్థితి సాధారణంగా ఏర్పడదు. హైడ్రోక్లోరిక్ ఏసిడ్‌లో వ్యాధి కారక క్రిములు నశించిపోతవి. ఏసిడ్ తగ్గిపోగానే ఆ క్రిములు నశించక చిన్నప్రేగులో ప్రవేశిస్తవి. ఇంతేకాదు. ఏసిడ్ తగ్గినప్పుడల్లా మ్యూకస్ అధికంగా తయారవుతూ ఉంటుంది. అందువల్ల కూడా జఠరాశయంలో ఆహారం అర్ధజీర్ణస్థితిలోనే డువోడినంలో ప్రవేశిస్తుంది. ఇందువల్ల తరుచు బేదివ్యాధి ఏర్పడుతుంది.

కడుపులో హైడ్రోక్లోరిక్ ఏసిడ్ తగ్గినందువల్ల వచ్చే దుష్ఫలితం అజీర్ణబేదిమాత్రమే కాదు. క్రిములు, మ్యూకస్ అధికం కాగానే జఠరాశయం మ్యూకస్ పొర ఇన్‌ఫ్లేం అవుతుంది. అది తీవ్రస్థితిలో ఆరంభమై దీర్ఘస్థితి అందుకోవచ్చును. లేక మొదటినుంచీ దీర్ఘస్థితిలోనే (chronic) ఏర్పడవచ్చును. ఆ స్థితిలో ఆహార పదార్థములలో ఉన్న ఇనుమును జీర్ణకోశం ఆహరించుకోదు. ఇందువల్ల ఒకరకమైన రక్తక్షీణత ఏర్పడుతుంది. ఈ స్థితి స్త్రీలలో చాలా తరుచుగా ఏర్పడుతూ ఉంటుంది.

రక్తంలో ఎర్రకణములు (R B.C. ఎముకలలో ఉండే గుజ్జులో Marrow) తయారవుతవి. ఈ గుజ్జు ఈ ఎర్ర కణములను (Red Blood Corpuscles) తయారుచేయడానికి, జఠరాశయంలో ఏసిడ్ పరిమాణానికి సంబంధం ఉన్నది. జఠరాశయంలో ఏసిడ్ లేనప్పుడు ఎర్ర కణముల ఉత్పత్తి తగ్గిపోతుంది. అప్పుడవి మామూలు ఎర్రకణములకంటె పెద్దవిగా ఉంటవి. సాధారణంగా ఎర్రరక్తకణములలో, న్యూక్లియస్ ఉండదు. కాని, ఈ స్థితిలో అల్పంగా తయారవుతున్న ఎర్రకణములలో కొన్నింటికి న్యూక్లియస్‌లు ఉంటవి. ఈ పెద్ద రక్తకణములను మేక్రోసైట్‌లు (Macrocytes) అంటారు. 'మేక్రో' అంటే 'పెద్ద'. 'సైట్' అంటె 'సెల్'. మలేరియాలోనూ రక్తస్రావంలోనూ ఏర్పడే రక్తక్షీణతలో ఎర్రకణముల సైజు మామూలుకంటె చిన్నవిగా ఉంటుంది.

ఇటువంటి కణములను మైక్రోసైటులు (Micro-cytes) అంటారు. 'మైక్రో' అంటే చిన్న 'సూక్ష్మమైన' అని అర్థము. ఈ స్థితి దీర్ఘమైన మలేరియాలో బుతుస్రావము అధికమైన వారిలో దీర్ఘమూ తీవ్రమూ అయిన మూలవ్యాధిలో ఏర్పడుతుంది. విపరీతమయిన రక్తక్షీణతను పాండురోగము అంటారు. రక్తక్షీణతవల్ల మొఖం పాలిపోతుంది. ఈ స్థితిని ఇంగ్లీషులో 'ఎనీమియా' (Anaemia) అంటారు. ఎనీమియా ఎర్రకణముల ఉత్పత్తి తగ్గినప్పుడు ఏర్పడవచ్చును. లేక ఇవి అత్యధికంగా అతిశీఘ్రకాలంలో నష్టమైనప్పుడూ నశించినప్పుడు ఏర్పడవచ్చును. ఎముకల గుజ్జు, రోగగ్రస్తమై ఏర్పడిన ఎనీమియాను "పెర్నిషియస్ ఎనీమియా" (Pernicious Anaemia) అంటారు. "పెర్నిషియస్" అంటే "అతి విధ్వంసకరమైన" అని అర్థము. ఇటువంటి ఎనీమియా లివర్‌లోనుంచి తీసిన సారమువల్ల నయమవుతుంది. రెండవ రకము, ఇనుము, (కాంతము) తో తయారయిన ఔషధములవల్ల ఉపశమిస్తుంది.

జఠరాశయంలో అల్పామ్లస్థితి ఒకరకమైన వెన్నుపాము వ్యాధిలోకూడా కనుపిస్తుంది. అప్పుడు వెన్నుపాములో అక్కడక్కడ కొన్ని ప్రదేశములు శైథిల్యము (Degenaration) పొందుతవి. ఆ స్థితిని నరాశయవ్యాధులు చర్చిస్తున్నప్పుడు వివరిస్తాను. ఒకే కుటుంబంలో ఈ వ్యాధీ అల్పామ్ల స్థితీ కనుపిస్తూంటవి. ఇందువల్ల ఇది కొన్ని కుటుంబాలలో పారంపర్యంగా వచ్చే వ్యాధిగా పరిగణించబడుతున్నది.

జఠరరసోత్పత్తి హేతువులు — జఠరరసము ఉత్పత్తి అధికము కావడమూ, అల్పము కావడమూకూడా నరముల స్థితినిబట్టి ఉంటుంది. ఈ రసం ఉద్రేకములు అధికంగా ఉన్నప్పుడు అది అధికం కావచ్చును మనస్సు నీరసించినప్పుడు అల్పమూ కావచ్చును. కొన్ని రసాయనికద్రవ్యములు ఈ రసము ఉత్పత్తిని అధికం చేయావచ్చు; మరికొన్ని తగ్గించవచ్చును.

జఠరాశయానికి పోయే నరం 'వేగస్' (Vagus). ఇది 10 వ శిరోనరము శిరోనరములు వివరిస్తున్నప్పుడు ఈ విషయం వివరించాను ఈ నరమే ఊపిరితిత్తికీ, హృదయానికీకూడా పోతుంది. కోపమూ, ఆందోళన కలిగినప్పుడు జఠరరసం అధికమవుతుంది. దుఃఖంలో నిరుత్సాహస్థితిలో అల్పంగా ఉంటుంది. వేగస్ నరానికి అపాయం కలిగినప్పుడు ఈ స్థితి ఏర్పడుతుంది.

శరీరంలో తయారయ్యే హిస్టమైన్ అనే రసాయనికవస్తువూ, జఠరరసం ఉత్పత్తిని అధికం చేస్తుంది మాంసము, మాంసరసం (క్లోరువా) పెప్టోనులు (సగం జీర్ణమైన ప్రోటీనులు) మసాలా ద్రవ్యములు జఠరరసం అధికం చేస్తవి డువోడినంలో ఏసిడ్, కొవ్వులు జఠరరసం ఉత్పత్తిని తగ్గిస్తవి. ★

# గళ్లనుడికట్టు - 106

## అడ్డం

1. మెడ రకములలో ఎత్తు.
3. దీపావళికి వెలిగించేది.
5. బ్రతుకు, వజీరు వందిలో ఉంటుంది.
7. రాకాసివిమూస్తే కొన్ని మాత్రమే!
9. గొల్లభామ.
10. మీ చేతిలోవిది!
11. వెలకలరాయి.
12. ముదితలంపులో స్త్రీయే.
14. ఒక లోహము. (ఈ పత్రికలో నడిచే ఒక సీరియల్ కథ గుర్తుకు తెచ్చుకోనండి!)
16. ఒక రంగు.
18. శాశ్వతం
20. దీనవదనంలో ఆశీర్వాదం!
21. కత్తులలో కాళ్లకు రానుకునేది.
22. దీనితో వెళ్లవేస్తారు.
23. ఈ పత్రికలో కథల బొమ్మలు వేసే మరో కరు.
25. నావను కదలకుండా చేసేది.
29. ఇహముకాదు!
30. రాము అప్పులు, ఆపదలను దాచవా?

## నిలువు

1. సోపానము.
2. నకలు వనజముకాదు!
3. మడిసికలో వ్యక్తి
4. ప్రఖ్యాతినొందిన పేరుకల ఒక ప్రఖ్యాత చిత్రకారుడు.



5. వేతనము.
6. ఆవనంతమాటని వెతికితే వడిపోవటం దొరుకుతుందికాని ఇక్కడ చిందరవందర.
7. ఒక చేదుకూర.
8. ఎల్లప్పుడూ!
13. రకము.
15. వ్రజ!
16. ఒక పండు, వేదములో వినవడుతుందా?
17. కలాగా—అంటారు.
18. అంతా!
19. రుసుములో వర్షము.
24. సంగీత విశేషము.
26. వర్తమానము మునుపటిది
27. మాటు!
29. మంచి.

## 105-వ గళ్లనుడికట్టుకు జవాబు



| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీ | వా | జీ | | మ | | క | | పా | రి | క |
| క్ష | | తే | యా | కు | పా | నీ | య | ము | | న్న |
| | | | | ట | | ని | | | | |
| వ | | అ | ల్ల | ము | | క | ద్రు | వ | | క |
| ద | గ్గ | ర | | లు | | లు | | స | క | లు |
| న | | మ | | | | | | స్త్రీ | | వ |
| ము | రా | రి | | స | | ఇం | | య | మ | కం |
| లు | | కి | ల | ము | | జ | ల | ము | | టి |
| | | | | ద్ర | | ను | | | | |
| పా | | స | మ | యా | ను | కూ | ల | ము | | తో |
| పే | రా | రి | | నం | | త | | రా | వు | లు |

★

"అవతలి వాళ్ళమీద చేసేవన్నీ చిన్న ఆపరేషన్లే!" అన్నాడు ఒక ప్రఖ్యాత శస్త్రవైద్యుడు.

ఈయన మిత్రుడేగావును ఇంకొక డాక్టర్ గారు తన కన్సల్టింగ్ గదిబయట ఒక నోటీసు అంటించాడు. "వెయిటింగ్ రూమ్‌లోని స్త్రీలు తమ కంప్లెయింట్లు గురించి చర్చించవద్దని ప్రార్థన. డాక్టర్ గారికి చాలా ఇబ్బంది కలుగుతోంది."

పి. జోగయ్య (వరంగల్లు)

* * *

"షేక్స్‌పియర్ నాటకాలన్నీ ఎలిజబెత్ రాణి రాసిందని రుజువుచెయ్య పోతున్నాను" అన్నాడు ఒక ప్రొఫెసర్ గారు.

"ఏమిటో ఒక స్త్రీ అంత గొప్ప నాటకాలు రాయగలదంటావా?" అని మరొక ప్రొఫెసర్ గారు వెక్కిరించారు.

"అది కాదు. నేను రుజువు చెయ్యబోయేది, ఎలిజబెత్ పురుషుడని!" ఇదీ ఆ ప్రొఫెసర్ గారి జవాబు.

కామేశ్వరరావు (కర్నూలు) ★

# గుండు కథ

**9-వ పేజీ తరువాయి**

నెవరో ఉద్ఘాటిస్తూ ఇలా అన్నారు— ఇంకా ఇలా అన్నారని ఇంకో ఆయనెవరో చెప్పారు.

"గండపెండేరాలు వేయించుకున్న గుండుకవులెందరో బ్రహ్మాండంలో ఉన్నా అందాన్ని అనందాన్ని పిండి—గుండకొట్టి 'గుండు' లాగ చేసి సదరు 'గుండు' కి 'చందమామ' అని చక్కగా పేరెట్టుకుని తమ కావ్యాల్లో వర్ణించుకున్నారు. అటువంటి చంద్రుడిలోనైనా మచ్చలు ఉంటాయి గాని—సిసలైన గుండుమాత్రం వంకలేని నెలవంకలాగ ఉంటుంది.

అందుకనే కవి కుమారులు మన గుండుని కుకీతో మిళాయించి ఉపమాలంకారం చేసేస్తారు.

కవిత్వం లాగానే కొంతమందికి గుండు కూడా సహజంగానే వస్తుంది. అటువంటి గుండుని 'బట్టతల' అంటారు. వాటిల్లో మళ్ళీ చాలా రకాలున్నాయి.

కొంతమందికి చూడముచ్చటగా 'వరండా' లాగ కొంచెం బట్టతల — అదైనా కేవలం లాంఛనప్రాయంగా ఉంటుంది.

మరికొందరిలో కుదురు ముదరి అంటు వ్యాధిలాగ, లేకపోతే విజయనగర సామ్రాజ్యంలాగ విస్తరించి, సముద్రంలాగ లోపలికి చొచ్చుకుని పోతుంది.

కొందరికి "మండువా" లాగ తల మధ్యలో ఉంటుంది బట్టతల. అరుదుగా కొందరికి పాలరాతి కోటలాగ మధ్యలో 'నిగనిగలాడే గుండూ'—ప్రహరీ చుట్టూ కందకంలాగ ఓ వరుస వెంట్రుకలూ ఉంటాయి. అటువంటి బట్టతలలున్న వాళ్ళు శీతాకాలంలో పెళ్ళికి వెళ్ళినప్పుడు పన్నీరు జల్లితే చలివేస్తుంది.

ఎండాకాలంలో తామరాకుమీద నీటిబొట్టుల్లాగ చెమట పడుతుంది. అసలు ఈ బట్టతలలు స్థిరాస్తుల్లాగ తాతముత్తాతల దగ్గర నుంచి సంప్రాప్తిస్తాయని జనన శాస్త్రజ్ఞులంటారు.

అందుకనే కాబోలు—పురాతన వస్తుసామగ్రి మీద అభిమానం కలవారికి మన గుండు కొత్తగా గిలాబా చేయించిన 'సాంచీ' స్థూపంలాగ అన్పిస్తుంది.

శాస్త్రజ్ఞులకి మటుకు కాంక్రీటు చేయించిన విమాన ఆశ్రయం జ్ఞాపకం వస్తుంది. జీవశాస్త్రజ్ఞులకి గుండుని చూస్తే రకరకాలైన గుడ్లూ, గుండెలూ జ్ఞాపకం వస్తాయి .... వాటికీ, వీరికీ అవినాభావ సంబంధం—అదీ సంగతి.

గుండుకి ఇంత ప్రత్యేకత ఉన్నా తిరుపతి వీధుల్లో మనల్ని అట్టే పట్టించుకోలేదు ఎవ్వరూ. ఎక్కడ చూసినా గుండూ, గుళ్ళూ, గోపురాలు. శతకోటి లింగాల్లో మనమూ ఓ బోడి లింగాలం ... అయితే మటుకు !? ఎవడిగుండు వాడికి ముద్దు (గిరీశంగారు చెప్పినట్టు 'సజీవ సాలగ్రామం' కదా.)

ఆలోచిస్తూ నడుస్తున్న నాకు గుండుతో స్నేహితుడొకడు ఎదురయ్యాడు, వీధి మలు

వుతో. అతి కష్టంమీద ఒకరినొకరు పోలిక పట్టుకున్నాం.

ఇద్దరం కలసి పోతుంటే "బోడు గుండ్ల సిస్టర్సు—లా" అన్నారు వెనుకనించి ఎవరో .... వెనక్కు తిరిగి చూశాం.

"గుండు .... డు, ము, వు, లు ప్రథమా విభక్తి" అనేసి పారిపోయాడో హైస్కూలు విద్యార్థి.

'ఏదో చాలా కాలానికి కలిశాం కదా' అని కూల్ డ్రింకు తాగడానికి ప్రక్కనే ఉన్న డ్రింక్ షాపులోకి వెళ్లాం. డ్రింక్ త్రాగుతూ తల ఎత్తే సరికి అన్నీ గుండ్లే .... చుట్టూ అద్దాలు .... ఎటు చూసినా నా గుండూ లేకపోతే మావాడి గుండూ .... ఎదురుగా చూశాను. సంవరసన కాయల్లాంటి గుండుల వరంవర .... వెనకో అద్దం. ముందో అద్దం. పైకి చూస్తే అక్కడా గుండ్లే .... మాకు గాభరావేసి బయటికి వచ్చేశాం.

ఉన్నట్టుండి "ఏమి టాలోచిస్తున్నావ్ ?" అనడిగాడు వాడు. "గుండు గురించి" అన్న నా జవాబుకి "ఇదొకటి కోతికి కొబ్బరికాయ దొరికినట్లు" అన్నాడు. (అసలు నా గుండు చూస్తే ఆ గుండుకి అసూయ కాబోలు).

దగ్గర్లో ఉన్న కొట్టుకెళ్లి "ఇక్కడ టోపీలు..' అని అడగబోతూంటే ......

"మీకా సందేహం అక్కర్లేదు, దయచేయండి" అన్నాడు కొట్టువాడు

పైగా "మంచి పాకెట్టు దువ్వెన లున్నాయి ఇమ్మంటారా !?" అని వాడే అడిగాడు. నాకు అరికాలు మంట నడిగుండు కెక్కింది. (నడి నెత్తికి అనడానికి—అప్పుడు నాకున్నది గుండే కదా !)

"వెధవ్వెట్లెయ్యక టోపీలుంటే ఏడవ మన్నా"ను.

వాడు ఏడుస్తూనే ముందు నా 'గుండు' ఉపరి తలాన్ని పరిశీలించాడు. 'టేప్' తో చుట్టు కొలత చూసాడు. ఘనపరిమాణం లెక్కల్లో ఇంటి కప్పుకేసి చూస్తూ ఏదో మంత్రాలు చదువుతున్నట్టు మొహం పెట్టాడు. దూలాలు లెక్క పెడుతున్నాడేమో ! అనుకున్నా.



"సైజు నెంబరు ఇరవై రెండు సరిపోతుంది" అన్నాడు చివరికి ఏదో సాధించినవాడిలా.

అక్కడితో ఊరుకోక టోపీ వెయ్యడం ప్రారంభించాడు.

'గాంధి టోపీ పెట్టుకుంటే అచ్చు నెహ్రూ గారిలాగ ఉంటారట. నేతాజీ టోపీ పెట్టుకుంటే అచ్చు హిందీ సినిమా యాక్టర్లా ఉంటారట. ఈవెనింగ్ హేట్ పెట్టుకుంటే సాక్షాత్తూ మన్మధుడు యూరోపియన్ డ్రెస్సులో వచ్చినట్టుంటారట.'

ఇంకా ఏదో చెప్పబోతుంటే "గుండుతో ఉంటే హాలీవుడ్ స్టార్లాగా ఉంటా, అయినా ప్రమాదమే .... ఎవరూ పోలికపట్టలేరు ఏం చేస్తాం !?" అని కొట్లోంచి బయటికి వచ్చి అత్తయ్యగారింటికి వచ్చేసాను.

సేమియాపాయసం తాగి పొందేవమ్మత్త దగ్గర సెలవు తీసుకుని సామాన్లు పట్టుకుని తిరుగుప్రయాణానికి సత్రం దగ్గర కొచ్చాను.

అక్కడ ఒక అమాయకుడు వెర్రిగా నాకేసి (అంటే నా గుండుకేసి) చూడ్డం మొదలుపెట్టాడు 'పోనీలే పాపం నాలో ఏమైనా 'దలైలామా' పోలికలు కనిపిస్తున్నాయేమోలే' అనుకున్నాను.

దగ్గరగా వచ్చి చెయ్యెత్తుతున్నాడు.

ఇదేమిట్రా బాబూ ! కొడతా డేమిటి చెప్మా కొంపదీసి—



మెత్తనిగుండు చూస్తే మొత్త బుద్ధి వేసిందేమో ? అనిపించింది.

తీరా చూస్తే చెయ్యెత్తి నమస్కరించాడు. 'ఎందుకు నమస్కరించావ్ ?' అని అడుగుతే బాగుండదని — అర్థంలేని నవ్వు ఓటి నవ్వి ఊరుకున్నాను.

"అయ్యా ! మిమ్మల్ని చూస్తే నమస్కరించే బుద్ధిపుట్టింది. నేను ఎన్నో గుండ్లు చూశాను కాని 'ఇంత విలువైన గుండు' ఎక్కడా చూడలేదండి" అన్నాడు. తను మహా గుండుయొక్క నాణ్యం కట్టేవాడిలాగ.

రాజకుమారుడికి 'రాజతీవి' ఉన్నట్టు మనకి 'గుండు తీవి' ఉన్ని నన్ను చూసి ఏ 'క్షవర కళ్యాణా నందస్వామి' అనుకున్నాడో అనుకున్నా.

అంతలో బస్సు వచ్చింది. లోపలికి ఎక్కి హాయిగా కూర్చుని గుండుమీద చెయ్యి వేసుకొని తడుముకుంటూ "బస్సు ఎప్పటికి కదుల్తుందో కదా ?" అని ఆలోచిస్తున్నా.

అంతలో ఓ పడుచు ఇల్లాలు వచ్చి వెనక నించి ఎడ పిల్లాడ్ని ఎత్తి కుదేసింది నా ప్రక్కనే; చంటాణ్ణి పదిలంగా నా వళ్లో వదిలేసి "జర గండి, అలా దిక్కులు చూస్తారేమిటి ?" అని నా మొహంవైపు చూసి ఆశ్చర్యపోయి నన్ను తోసి కూర్చున్న మనిషి అలాగే సిగ్గుపడిపోయింది.

ఆవిడ భర్తకాబోలు వచ్చి "అదేమిటే ! నీ అమాయకత్వంమండా" అంటూ నోరు తెరుచుకుని ఉండిపోయాడు.

తమాషా ఏమిటంటే ఆయనకీ గుండే !!! (నాకు మల్లే).

ముత్తానికి మరేం గొడవల్లేకుండా సురక్షితంగా ఇల్లు చేరుకున్నాను.

నన్ను చూడగానే "చచ్చి స్వర్గాన్ని ఉన్న బామ్మ గారు లాగూ చొక్కా వేసుకుని వస్తోందేమిటి చెప్మా !!!" అనుకున్నారుట నాన్నగారు.

నాన్నగారికి "నా గుండు" బామ్మగారిని స్మరణకి తెచ్చిందంటే అందులో అతిశయోక్తి ఏమీ లేదు. బామ్మగారి 'గుండు' చూసే యోగ్యత భాగ్యం లేకపోయినా అందరూ చెబుతూంటే విన్నాను. అసలు బామ్మగారి గుండే గుండుట.

ఆవిడ నెలకొకసారి, మామిడి చిగురులా మొలకెత్తిన గుండుమీద మల్లెపందిరలాంటి తెల్ల వెంట్రుకల్ని, మంగలిని పిలిపించి అరగంటసేపు

# గుండు కథ

చేరమూడి ఐదు నిమిషాల్లో తీయించి చేత్తో తడివి చూసుకుని సంతృప్తిచెందిన తరువాతే డబ్బిచ్చేదిట. (ఆయనే ఉంటే నువ్వు పావలా అడుగుదువా !?" అన్న జోకు మొట్టమొదట ఆవిడే వేసిందట.)

ఆ రోజుల్లో బామ్మగారి 'గుండు'ముందు అన్ని గుండ్లూ బలాదూరేనట. కాని ఆవిడ చాలా నిరాడంబరురాలు కాబట్టి గుండుకి ముసుకు వేసేదట. అదీకాక పూర్వం ముసుగు లేకపోతే రాత్రిళ్ళ హరికథల్లో చీకట్లో లింగభేదం తెల్సేది కాదుట

మునుపు మునుపుగా గుండు చేయించుకోడానికి మొహమాట పడినవాళ్ళు ముందు నగం గుండు చేయించుకుని మిగిలిన నగం జుట్టూ 'కొత్తిమీర కట్ట' లాగ ముడివేసుకునేవారుట. (అంతకు ముందు జన్మలో ఆడవాళ్ళయినవారు ఆ ముడిలో పువ్వులు కూడా పెట్టుకునేవారుట.)

శాంతక్క నవ్వుతూనే "తప్పు గుండు అన కూడదు" అని మళ్ళీ వన్స్‌మోర్‌గా నవ్వింది. నాకేమో ఉడుకుమోత్తనం వచ్చింది.

"అమ్మా, మొన్న సినిమాలో ఈ గుండుగాడే కదే చాకు పట్టుకుని అందర్నీ ఏడిపించాడు ?" అని మళ్ళీ మొదలెట్టింది పాప. (దానికి వన ఎక్కువ పోశారేమో చిన్నప్పుడు ?)

అర్జంటుగా ఏదో జ్ఞాపకం వచ్చినట్టు "ఫుట్ బాల్ మేచ్‌కి వెళ్ళాలి" అని లేచాను పాప బాధ భరించలేక.

"నేనూ వస్తాను. తీసుకెళ్ళవా !?" మారాం చేసింది అది.

తీసుకెళ్ళనంటే ఇంకేమన్నా ఉందా ? చచ్చినట్లు 'సరే' అన్నాను (దారిలో అల్లరి చెయ్యనని ముందరే దానిచేత ఒప్పించి).

మేం వెళ్ళేసరికే చాలమంది జనం వచ్చి కూర్చున్నారు. మేచ్ మొదలయ్యింది. పాప అల్లరి కూడా మొదలయ్యింది



కొన్ని కొన్ని రోజుల తర్వాత ఇది పూర్తిగా "అవుటాఫ్ ఫేషన్ అయిపోయింది " ఎంతైనా గుండు అందం గుండుదే!!!! ఏమంటారూ!!!?

మర్నాడు స్వామివారి ప్రసాదం ఇవ్వడానికి శాంతక్కావాళ్ళింటికి వెళ్ళాను. నన్ను చూడగానే నవ్వు ఆపుకుంటూ "ఏమిటి విశేషాలు?" అని అడిగింది.

"ఏం ఉన్నాయి ! ఇదే ఓ విశేషం" అన్నాను ఒకచేత్తో గుండు తడుముకుంటూ మరోచేత్తో అద్దా ఇద్దూ.

అద్దానీ—నా గుండునీ చూసిన పా..,

"అమ్మా రెండు గుండులు" అంది, అది అసలే సిసింద్రీపాటం. అది అలా అంటే నాకు మహా సిగ్గేసింది.

"తప్పు. తంబు మామయ్యని గుండు అనొచ్చా ?" అని శాంతక్క వెంటనే పాపని కోప్పడేసింది.

అది వింటేగా ? మిరపకాయ నరుకు.

"తంబు మామయ్యకాదు. 'గుండు మామయ్య" అంది తప్పట్లు కొడుతూ.

"గుండుమామయ్యోయ్" అంది గట్టిగా. జనం అంతా నావైపు చూశారు. అవలీగుం[illegible] నా కదోలా అనిపించింది. అందులోనూ మా వెను[illegible] అంతా మా కాలేజీ అమ్మాయిలే కూర్చున్నారు

తను చేసే అల్లరికే అందరూ నవ్వుతున్నారు కదా అని "గుండు మామయ్యోయ్" అంది మళ్ళీ గొప్పగా—గట్టిగా.

ఇదే సమయం అనుకుని నామీద పూర్వం కోపంగా ఉన్న అమ్మాయిలు కొందరు కష్టపడి చెమటోడ్చి మరీ నవ్వారు

నాకు నామోషీ అనిపించింది. "ఏమిటే ?" అని అడిగేశాను కోపంగా.

"ఇక్కడ చీమలున్నాయి" అని రెండో ప్రక్కకు వచ్చి కూర్చుంది.

ఈ లోపులో ఒక 'గోల్' అయింది.

ఉన్నట్టుండి "గుండు మామయ్యోయ్" అంది మళ్ళీ.

ఇంక లాభంలేదు దీన్ని మంచితనంతోనే సాధించాలని అనుకుని మచ్చికచేసుకోడానికి వెంటనో చాక్‌లేట్ ఒకటిచ్చాను.

పాపం అది మంచిపిల్లే ! అల్లరి చెయ్యకుండా చాక్‌లెట్ తింటోంది. మాచ్ మంచి పట్టులోకి వచ్చింది. "గోల్" అవ్వబోయి, మానెయ్యబోయి మళ్లీ అయిపోతుందేమో అనిపిస్తుంది. నా ప్రక్కన ఉన్న ఆయన తుమ్మనా వద్దా అని చాలాసేపు ఆలోచించి చివరకు 'గోల్' అయాక తుమ్ముదాం అని వాయిదా వేసుకున్నాడు.

"గుండు మామయ్యోయ్."

.... .... .... నా నోటంవట మాట లేదు.

బ్యాక్‌గ్రౌండ్‌లో నవ్వులు.

"చాక్‌లెట్ అయిపోయింది."

వెంటనే మరో చాక్‌లెట్ తీసి పాపనోట్లో పెట్టేశాను.

అంతలో "టప్ టప్" అని ఏమిటో చిన్న చిన్నవి నా గుండుమీద పడ్డట్టు నాకు అనుమానం వేసింది. వెనక్కి తిరిగిచూశాను. అందరూ మ్యాచ్ చూస్తున్నారు. మళ్లీ ఇటు తిరిగాను. ఇంకో మూడు, నాలుగు పడ్డాయి .... ఏమిటి ! అని పక్కల్లి చూశాను కనుపించినవి బటాణీలు.

వెనక్కి తిరిగి చూశాను. మా పక్కింటి అమ్మాయి 'సురేఖ' కూడా వచ్చింది. మాచ్ మంచి హుషారుగా చూస్తున్నారు అందరూను. అదే గోలలో పాప 'గుండు మామయ్యోయ్' అంది. కాని ఎవరికి వినిపించలేదు. వెంటనే నా దగ్గరున్న చాక్లెట్లన్నీ ఇచ్చేశాను దాని బాధ పడలేక.

అంతలో మళ్లీ జలజల రాలాయి నా గుండు మీద బటాణీలు—(బటాణీలే ఇంత బాధ పెడుతున్నాయి. వడగళ్లవాన పడుతే ? అమ్మో ! అనుకున్నాను) వెనక్కి తిరిగి చూశాను. దొంగ దొరికిపోయింది. మా పక్కింటి అమ్మాయి నన్ను బటాణీతో కొట్టడానికి రెడీగా ఉంది. నన్ను చూడగానే ఎత్తినచేతిలో బటాణీ ఏమీ తెలియనట్లు తినేసింది.

మళ్లీ మ్యాచ్ చూస్తున్నాను. బంతి ఆకాశంలోకి కొట్టేశా డెవడో. సరిగా కావాలని నామీద పడాలనే కొట్టాడేమో అనిపించింది. బంతి నా గుండుమీద పడుతుందేమోనని అనుమానంవచ్చి గబుక్కున రెండు చేతులతో గుండు కప్పేసుకుని ఒక్కసారిగా తల వంచేశాను. అయితే బంతి నావైపు రాలేదు. మా వెనుక కూర్చున్న కోమలాంగులు గొల్లున నవ్వారు. ఇంక అక్కడ కూర్చోలేక బయటకు వచ్చేశాను.

'గుండు' అంటే అందరికీ ఎందు కింత లోకువ అని నాకు ధర్మసందేహం వచ్చింది ఎందుకైనా మంచిదని అద్దంలో మరోమారు చూసుకున్నాను.

సినిమాల్లోలాగా అద్దంలో నా బదులు నా అంతరాత్మ కనుపించింది. నన్నుచూసి నవ్వింది. చిరాకేసి "యూ టూ బ్రూట్" అన్నాను భారంగా.

"నాయనా అందంగా ఉన్నా ననుకోవడం మానవుడి మొదటి పొరబాటు. దానికి తోడు అద్దాలు అబద్ధాలు చెబుతున్నాయి. పైపై మెరుగుల ప్రాపింగులు తీసేస్తే విగ్గుతీసిన సత్యం విగ్గు తేరినట్టు బయటపడుతుంది. హాఁ! హాఁ ! .. ఇదీ నీ నిజస్వరూపం. అందానికి అర్థంలేదు. హిఁ ! హిఁ !" నన్ను చూసి ఫక్కున నవ్వేసింది నా అంతరాత్మ.

అయినా నాకు నమ్మకం కుదరలేదు. అదీకాక అంతరాత్మమాట విన్నవాళ్లు ఎవరూ (నాకు తెలిసినంతవరకూ) బాగుపడలేదు. నిక్షేపంలాంటి 'నా గుండు' అందంగా లేదుట.

అసలు అందం అనేది లేదుట. ఏడిసింది అంతరాత్మ అనుకున్నాను. ఏమయినా గుండుమీదికి మళ్లింది నా ఆలోచన అసలు యీ దేవుడికి గుండుసరదా ఏమిటి చెప్మా !" అని సందేహం వచ్చింది. ఎంత ఆలోచించినా అంతు చిక్కలేదు.

ఒకవేళ భక్తుల "గుండుల" మీద జలతరంగిణిలా ఏదైనా వాయిద్యం వాయిస్తాడేమో అనుకున్నాను.

"ఏడిశావ్" అంది అంతవరకూ నిశ్శబ్దంగా ఉన్న అంతరాత్మ.

ఇంతకూ "గుండు" అనేది అందంగా ఉంటుందో ఉండదో తేల్చుకోలేక పోతున్నాను ఈ వెధవ అంతరాత్మతో !

ఏమైనా మీరే చెప్పండి—గుండు అందంగా ఉండదూ !!!?

★



# హరివంశం

7 వ పేజీ తరువాయి

"బాగు ! బాగు ! నీవు ఆ గానమును విన్నావు వలె ఉన్నది !"

"నేను వినలేదు. మహారాజ ! దారుకస్వామి విన్నాడు. ఆయన అది ఎట్లుండునో చెప్పినాడు. అందువలన నేను ఆయనవిద్యకును ఆ గానమునకు పోలికపెట్టుకున్నాను. స్వామి ! ప్రపంచములో నందరును నన్నియు, స్వయముగా చూచినవానిని గురించియే, వినినవానినిగురించియే మాటలాడెదరు. కొన్నిటినిగురించి కొందరు చెప్పగా, మనస్సుచేత అవి అట్లుండునని యూహచేసి, అవి యట్లు లున్నవనుకొందురు. నేను అట్లనుకొనినాను."

"బాగున్నది."

"బాగుగానున్న దేమియో ఇప్పుడు చెప్పబోవుచున్నాను."

అని మాతలి తన సహచరులవైపునకు చూచెను. వారు వానివంక చూచిరి. ఒకరికన్నులు ఒక్కరివిగా వారు చూచుకొనిరి. ఆ కన్నులలో ఆనందమో, అద్భుతమో యున్నది. వారి యొడళ్ళు పులకలుతేరినవి. అది గుర్పాటుగా నున్నది. మాతలి అనినాడు. "స్వామి ! ఇప్పుడు నేను చెప్పబోవునది ఒకరు కన్నది కాదు. విన్నది కాదు. అంత ఆశ్చర్యకరమైనది. అంతటి అద్భుతావహమైనది. కనులున్నందుకు ఫలము అట్టి దర్శనము. మహారాజ ! అది భగవంతుని విశ్వరూపసందర్శనము వంటిది.

వేదములున్నవిగదా ! అందులో ఒక కథ యున్నది. ఉన్నది కాదు, యున్నదట. అదియు దారుకస్వామియే చెప్పెను. ఆయన చిన్నవయసువాడు. అనగా వృద్ధుడు కాదు. ఇన్ని ఎట్లు తెలిసినవి అని ఆ ప్రశ్న నాకు ముందు రాలేదు. తరువాత వచ్చినది. నేనును సూతుడనేకదా ! నేను ఆయనయంత నేర్చినవాడను కాదు. ఆయనయు నది యంతయు స్వయముగా నేర్చెనా ! వినియుండును. ఆచార్య సాందీపని ఆశ్రమము విద్యలకు నిధికదా ! అక్కడ చెట్లకుగూడ వేదములు వచ్చునట ! దారుకస్వామి చెప్పినాడు. చెప్పి ఈ కథ చెప్పినాడు. మేము వినినాము. తరువాతగాని, అది విద్యయని అందునను రథసారథ్యవిద్యయని తెలియలేదు. వేదములలో అశ్వినుల రథవిద్యావేత్తలనుగా చెప్పుట మా తండ్రిగారు చెప్పగా విన్నాను. దారుకస్వామి పూషుని కథ చెప్పినాడు. ఆయన కంఠము మధురమైనది. ఆ మాధుర్యముచేత నాయన అప్పుడు చదివిన మంత్రము లింకను నా తలలో నిలచియే యున్నవి."

మాతలి యంతలో తీక్ష్ణుడైనాడు. అతని కంఠము విచిత్రమై, మధురమై, ఉదాత్తానుదాత్తస్వరితప్లుతముగ నా మందిరమం దంతటను వ్యాపించినది.

యాస్తే పూషన్నావో అంతః సముద్రే
హిరణ్యయీ రంతరిక్షే చరన్తి
తాభిర్యాసి దూత్యాం సూర్యస్య
కామేన కృతశ్రవ ఇచ్ఛమానః."

ద్యావాపృథివ్యంతరంలో పూషుని నావలు కదులుతున్నాయి. సముద్రంలో నౌకలు ఎట్లో, అట్లు కదులుతున్నాయి అవి బంగారు నౌకలు. ద్యుతిమంతములు. ఆయన సూర్యపుత్రివద్దకు దౌత్యము పోవుచున్నాడు. ఆమెను ప్రేమించి, కీర్తిని కామించి పోవుచున్నాడు. ఆ పూషుడు దివమునకు, పృథ్వికిగూడా ప్రియతముడైనవాడు. బంధువు. మఘవుడు. ఇడస్పతి. వర్చస్వి. ఆయన సముద్రము వంటి అంతరిక్షములో తన నౌకలను నడిపించినాడు. దేవతలు ఆయనకు సూర్యపుత్రిని ఇచ్చినారు.

పూషా సుబంధుర్దివ ఆ పృథివ్యా
ఇడస్పతిర్మఘవా దస్మవర్చాః
యం దేవాసో అదదుః సూర్యాయై
కామేనకృతం తవసం స్వఞ్చమ్.

(సశేషం)

# యువ ప్రపంచం

## బోధనా భాష

నేటి కళాశాలల్లో బోధనా భాషగా మాతృభాష అయిన తెలుగును ప్రవేశపెట్టాలని బాధ్యతగల వ్యక్తులు బాహాటంగా ప్రకటించటం శోచనీయం. బోధనాభాషగా తెలుగునే ప్రవేశపెట్తే రాష్ట్రాన్ని వదలి ఉద్యోగం చెయ్యటం కష్టతరం అవటమే కాకుండా అనేకవిధాల భాషేతరాలవారు యిక్కట్లు పడవలసి వస్తుంది. ఇక విదేశాలకు వెళ్ళి ఉద్యోగాలు చేయవలసినవారి సంగతి, చదువుకొనవలసినవారి సంగతి ఏమిటి?

బోధనాభాష ఏది? అన్నది నిర్ణయించవలసినది అఖిలభారత అధ్యాపక బృందమున్నూ, కేంద్రప్రభుత్వ విద్యాశాఖయున్నూ. అంతేకాని రాష్ట్రప్రభుత్వం కాదు.

ఈ విషయంలో రాష్ట్ర ప్రభుత్వం 'తొందరపడి' ఏ నిర్ణయం తీసుకున్నా తప్పటడుగు కాగలదు.

కొంకిమళ్ళ శారద (విజయవాడ).

* * *

## విద్యార్థుల దుస్తులు

యువప్రపంచం అన్ని విధాలా ముందంజ వేస్తోంది. రోజురోజుకీ పోకడలు మారిపోతున్నాయి. ముఖ్యంగా యువ ప్రపంచానికి సంబంధించినదీ, చర్చించతగినదీ ఏదంటే దుస్తులు. నేటి యువతీయువకులు ధరించే దుస్తులు చూస్తుంటే నిజంగా ఆశ్చర్యం వేస్తుంది. ఏ కాలేజీకి వెళ్ళి చూసినా, ఏ యూనివర్సిటీకి వెళ్లి చూసినా రకరకాల దుస్తులు, రకరకాల ఫాషన్లలో కన్పిస్తాయి. ఈ ఫాషన్లు ఈమధ్య మరీ ఎక్కువై పోతున్నాయి. అవి చూస్తుంటే విద్యార్థులు వాటిమీద చూపే ఆసక్తి విద్యయందు కనబరుస్తున్నారా? అని సందేహం కలుగుతూంది. కొన్ని కాలేజీలలో కొందరు విద్యార్థులమధ్య ఎవరు 'మోస్ట్ అప్-టు-డేట్' గా తయారవుతారో అని పోటీలు. వందలకొద్దీ డబ్బు దుస్తులనిమిత్తమై దుర్వ్యయం చేయడం. ఫ్యాషన్లలో ఈ మార్పు అభివృద్ధి కానేకాదు. తిరిగితిరిగి బయలేరినచోటికే వచ్చినట్లు ఇవన్నీ తిరిగి పూర్వపు ఫ్యాషన్లే అవుతాయి. అటువంటి వాటికోసం ఈ మధ్య కాలంలో ఇంతడబ్బు ఖర్చించడం ఎందుకు? ఇది విద్యార్థుల తప్పుకాదు. వారికి అందరికన్న 'ఫ్యాషనబుల్'గా ఉండి అధిక్యత నిరూపించుకోవాలి అని ఉబలాటం ఉంటుంది. మరిదీనికి కారణం ఏమిటంటే ఒక కాలేజీకి ఒక ప్రత్యేకమైన దుస్తులు ఏర్పరచకపోవడం. ఈనాడు కొన్ని పాఠశాలలు కాన్వెంటులు మొదలైనవాటిలో విద్యార్థులకు వేరువేరు దుస్తులు ఉన్నాయి. ఆ సంస్థలకు వెళ్లి చూస్తే అందరూ ఒకటే దుస్తులు ధరించి ఉండడం చూడముచ్చటగా ఉంటుంది. మరి అదేపద్ధతి కాలేజీలకు, యూనివర్సిటీలకు ఎందుకు అన్వయించరు? ఇంత బుద్ధివికాసం వచ్చినతరువాత ఇంకా దుస్తుల ప్రత్యేకత ఏమిటంటారు కొందరు. నామట్టుకు నేను బుద్ధివికాసానికి బాహ్యడంబరాలతో పనిలేదంటాను. అందరూ ఒకటేదుస్తులు ధరించడం వారిలో క్రమశిక్షణను తెలియజేస్తుంది. వేరువేరు దుస్తులు ధరించడంవల్ల, ఆ దుస్తుల విలువలనుబట్టి విద్యార్థులలో ధనిక బీదభావం నాటుకుంటుంది. అదే అందరికీ అందుబాటులో ఉండే ఒక ప్రత్యేకమైన 'యూనిఫారమ్' ఏర్పరిస్తే ఈభావం కలగడానికి ఆస్కారమే ఉండదు. ఈ ప్రత్యేక దుస్తుల పద్ధతి ఒక విద్యార్థులకే కాకుండా ఉపాధ్యాయులకు, లెక్చరర్లు, ప్రొఫెసర్లకు కూడా అన్వయిస్తే మరీ మంచిది.

వి. వి. ఆర్.
ఆంధ్రా యూనివర్సిటీ (వాల్తేరు)

* * *

## పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు

పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులకు మనరాష్ట్రంలో విద్యార్థులకు అవకాశం లేకపోవటం శ్రీ వి. బి. శంకరరావుగారు వ్రాసినట్లు ఈనాడు ఒక ముఖ్య సమస్య. కేవలం యూనివర్సిటీ సెంటరులో ఉండి చదువుకొనగల్గిన ధనస్తోమతు కలవారికి మాత్రమే ఈ చదువులు పరిమితమవుతున్నాయి. ఇందువలన తెలివితేటలు కలిగికూడా చాలమంది కేవలం బి. ఏ., బి.యస్‌సి. లేక బి.కాం.లతో ఆపివేసి గుమాస్తా, డిమాన్‌స్ట్రేటరు లాంటి ఉద్యోగాలకి పోటీలుపడి, అసలే దారుణంగా వున్న నిరుద్యోగ పరిస్థితని మరింత దారుణం చేసేస్తున్నారు. డబ్బులేని కారణంగా వీరు పై రాష్ట్రాలకు వెళ్ళి ఉద్యోగ ప్రయత్నాలు చేయడానికి కూడ సాహసించలేకుండ ఉన్నారు.

ఈ పరిస్థితులలో మన రాష్ట్రంలోని మూడు యూనివర్సిటీలు తమ తమ అభిప్రాయాల్ని మార్చుకొని, కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, మచిలీపట్నం, విజయవాడ లాంటి ముఖ్యపట్టణాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులకు అవకాశము కల్పించాలి. దీనివలన విద్యాప్రమాణాలు తగ్గుతాయనడం సరికాదు.

మూర్తి (మంచిర్యాల్)

* * *

## వర్ణాంతర వివాహాలు

ఈమధ్య శ్రీ కె. వి. ఎస్. సోమయాజులు (బెంగుళూరు) వరకట్న నిర్మూలనగూర్చి రాసిన ఉత్తరం మా మిత్రులకు ఎంతో ప్రోత్సాహము ఇచ్చింది.

శ్రీ సోమయాజులుగారు చెప్పినట్లు "యువప్రపంచం" శీర్షికలో నేటి యువతీయువకుల సమస్యలు చర్చిస్తున్నారుగాని ఆ చర్చలు నిర్మాణాత్మకకృషికి తోడ్పడాలంటే ఒక సంఘముస్థాపించాలి. ఆ సంఘములో సభ్యులుగా చేరినట్లయితే వర్ణాంతరవివాహంచేసికోటం, వర్ణాంతర వివాహములు ముందంజ వేయడము జరుగుతుంది.

దాలిబోయిన మంగతాయారు
(విశాఖపట్టణం) ★

## గమనిక

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## దీపావళి కథలపోటీ

**మొదటి బహుమతి రు. 600; రెండవ బహుమతి రు. 350; మూడవ బహుమతి రు. 200**

29-6-62 తేదీ ఆంధ్రసచిత్రవారపత్రికలో పడిన పై పోటీ ప్రకటనలోని 'కథలు త్రిప్పి పంపగోరువారు తమ పూర్తి చిరునామా కల కవరు జత పరచాలి' అన్న వాక్యం 'కథలు త్రిప్పి పంపగోరువారు తగుమాత్రం పోస్టేజీ కల కవరు జతపరచాలి' అని ఉండవలసింది.

సంపాదకుడు.




**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

